# నా ఉత్తరదేశ యాత్ర

( ప్రసిద్ధ స్థలాలను గురించిన విశేషాలు



బులుసు వేంకటరమణయ్య
33, సింగరాచారి వీధి, ట్రిప్లికేన్
మదరాసు - 5

ప్రచురణ :
మే—1958

ఇతర రచనలు :

| | | | రూ. | న. పై. |
|---|---|---|---|---|
| 1. | గజపతులనాటి గాథలు | ... | 1 | 00 |
| 2. | ,, ,, | ... | 1 | 00 |
| 3. | అభిషేక నాటకము | ... | 1 | 50 |
| 4. | నా దక్షిణదేశ యాత్రలు | ... | 1 | 50 |
| 5. | ఆంధ్ర కవి సప్తశతి | | | |

వెల :
రూపాయిన్నర.

ముద్రణ : స్వతంత్ర ప్రెస్
మదరాసు-2

# విషయానుక్రమణిక

# నా ఉత్తరదేశ యాత్ర

★

## యాత్రా సన్నాహం

అందరమూ ఆ రోజు చాలా ఉత్సాహంతో వున్నాం. రాత్రి బయలుదేరి పదహారుమంది ఉపాధ్యాయులం దక్షిణ దేశంలోని ముఖ్యస్థలాలు కొన్ని చూడడానికి బయలు దేరుతున్నాం. మా పార్టీ లీడరు శ్రీ జె. డి. ముత్తయ్యగారు సభ్యుల కందరికీ ప్రోగ్రాముల కాగితాలు అందిస్తూ ఉన్నారు.

అప్పుడు మాలో ఒకరు "మనం చాలాసార్లు దక్షిణ దేశంలో తిరిగాము. ఒకసారి ఉత్తర దేశానికి వెళ్ళితే బాగా ఉంటుంది. ఢిల్లీ చూడాలని నాకు చాలా రోజులనుంచీ కోరికగా ఉన్నది. ఉత్తర దేశయాత్ర ఏర్పరిస్తేనే అది నెరవేరుతుంది" అన్నారు.

"అభ్యంతరమేమీ? అలాగే వెళ్లుదాం. ఇకమీద సెలవుల్లో యాత్ర ఉత్తర దేశానికే అని నిశ్చయించుకుంటే సరి! మన లీడరు బాధ్యత వహిస్తే తప్పకుండా మన కోరిక సఫలమవుతుంది" అని మాణిగారన్నారు.

లీడరు చిరునవ్వు నవ్వుతూ "బాధ్యత కేమిలెండి! మీరంతా సహకరించి, అందరమూ ఒక్క మాటమీద ఉంటే ఎంత పనైనా చేయవచ్చును. కాని, ఒక సంగతి

గమనించాలి. ఉత్తర దేశ యాత్ర అంటే సామాన్యం కాదు.
అక్కడి భాష వేరు. మీ ఇంగ్లీషు అక్కడ పనికిరాదు.
స్థలజ్ఞులుకూడా మనలో తక్కువగా ఉన్నారు. మనం రైలు పెట్టెలను రిజర్వు చేసుకొని వెళ్లాలంటే సాధ్యం కాదు. టూరిస్టు కారు ఏర్పాటుచేసుకోవాలి. అప్పుడే ప్రయాణం కొంత సుఖంగా ఉంటుంది. దానికి ఏభయిమంది అయినా ఉండాలి. అన్ని శాఖలవారూ చురుకుగా పని చెయ్యాలి. ఒక్కొక్కరు రెండువందల రూపాయలు ఖర్చుచెయ్యడానికి సిద్ధపడాలి. కొంచెం తగ్గితే తగ్గవచ్చు. కాని, ముందు జాగ్రత్త మేలు! ఒకేసారి అంత సొమ్ము యిచ్చుకోలేని వారు ఇప్పట్నుంచీ నెల కింత—అని కొంత వెనక వేసుకోవాలి. అలా సొమ్ము ఇస్తే జాగ్రత్తగా ఉంచడానికి నా అభ్యంతరం లేదు'' అన్నాడు. దానికి అందరూ సమ్మతించారు.

దక్షిణాది యాత్ర పూర్తిచేసుకుని వచ్చాక అందరికీ ఉత్సాహం ఎక్కువైంది. శ్రీ ముత్తయ్యగారి ఆధ్వర్యంలో ఆ యాత్ర ఎంతో సంతృప్తిని కలిగించింది. అందువల్ల రమారమీ ముప్ఫయిమందిసభ్యులు ఉత్తర దేశయాత్రకుపేర్లిచ్చి పడి నెలనెలా కొంత సొమ్ము వెనక వెయ్యసాగారు.

సెప్టెంబరు నెలలో జరిగే ప్రయాణంకోసం మేము ఏప్రిలునుంచీ యత్నం చెయ్యవలసి వచ్చింది. మొదట టూరిస్టు కారుకు దరఖాస్తుపెట్టడం జరిగింది. దాని ఫలితం జూనులో గాని తెలియదన్నారు. రైల్వేఅధికారులకు కొందరు పరిచితులున్నా, కారు సంగతి ముందుగా తెలియలేదు. జూనులో, బడి తెరిచాక కనుక్కుంటే—మాది ఆరవ దరఖాస్తనీ, కారు సప్లయి చెయ్యడానికి అవకాశం ఉంటే ఉండవచ్చనీ

వార్త వచ్చినది. మరొక నెల్లాళ్ళకు—ఎవరిదో ఒక దరఖాస్తు ఉపసంహరించుకోబడడంవల్ల మాకు ఐదవ స్థానం చిక్కింది. అప్పుడు "టూరిస్టుకారు తప్పకుండా దొరకగల"దనే ధైర్యం కలిగింది.

ప్రజలకు సౌకర్యాలు కలుగచేస్తామని మాటవరుసకు రైల్వేవారు అంటారు. కాని, సదుపాయాలు పొందడానికి ప్రజలు అష్టకష్టాలూ పడవలసి ఉంటుంది. టూరిస్టుకారు లభిస్తుందని ఖచ్చితంగా తెలిసినతర్వాతకూడా అది చేతిలో పడడానికి ప్రతిదినమూ మా లీడరూ, ఆయనకు సహాయులుగా ఉన్న శ్రీ ఎన్.డి.సుందరంగారూ రైల్వేఅధికారులవద్దకు నిత్యయాత్ర సాగించవలసి వచ్చింది.

తర్వాత మేము ఏ తేదీని ఏ రైలులో బయలుదేరేదీ, ఏయే వూళ్లలో ఎంతకాలం వుండేదీ, మా కారును ఏయే బండ్లకు తగిలించవలసి వుండేదీ వివరంగా మా ప్రోగ్రాముడు తయారుచేసి, సమ్మతికోసం అధికారులకు పంపవలసి వచ్చినది. వారున్నూ, ఆయా స్థలాలలో వున్న అధికారులకు వ్రాసి, వారి సమ్మతినికూడా పొంది మాకు తెలియజేశారు. మా ప్రోగ్రాం ప్రకారం సెప్టెంబరు 17-వ తేదీని బయలుదేరవలసి వుంది. దానికి తగినట్లు ఏర్పాట్లు జరిగాయి. ఆయా చోట్లలో ముఖ్య స్థలాలకు పోవడానికి బస్సుల ఏర్పాటుకూడా వీలయినంతవరకూ జరిగింది.

ఉత్తరాదిప్రయాణం దక్షిణాదిప్రయాణమంత సుకరం కాదు. ముఖ్యంగా భోజనాదుల విషయంలో చాలా శ్రమ పడాలి. ఉత్తర దేశంలో మంచి పాలు దొరుకుతవనీ, అవి చవుకగానూ ఉంటాయనీ, పళ్లు సమృద్ధిగా లభిస్తాయనీ—

పళ్లూ, పాలూ లభించడంవల్ల భోజనం సరిగా ఉండకపోయినా, కష్టం తోచదనీ కొందరు తలుస్తారు! ఇలా చెప్పేవారు ఇతరుల మాటలపైని ఆధారపడినవారే కాని, స్వయంగా చూచినవారు కారు. చూచే ఉన్నట్లయితే ఈ విధంగా అనరు. భోజనంవిషయంలో మనం స్వంతంగా ఏదయినా ఏర్పాటు చేసుకోకపోతే చాలా ఇబ్బంది పడవలసి వస్తుంది. యాత్ర కూడా సానుకూలంగా నెరవేరదు. ఆ ప్రాంతాలలో కొంత పరిచయం కలవాళ్లం జట్టులో ఉన్నందున బాగా ఆలోచించుకుని, మాతో—తగిన బందోబస్తుతో వంటవారినికూడా తీసుకువెళ్ళడానికి నిశ్చయించుకున్నాం. రంగారావుగారు తన ఇద్దరు సహాయులతో మాకు భోజన, ఫలాహారాల సప్లయికి పూనుకున్నారు. తానే పూర్తి బాధ్యత వహించి, రెండు పూటల భోజనానికీ, రెండు వేళల కాఫీ, ఫలాహారాలకూ మనిషికి రూపాయిన్నర మాత్రం తీసుకోడానికి సమ్మతించారు. ఈ విధంగా అతడు అంగీకరించడం మాకు శుభసూచకంగా తోచింది. ఆ విధంగా ఏర్పాటు జరక్కపోతే మేము యాత్రలో నానా చిక్కులూ పడి వుండేవారం, తిండి విషయంలో.

టూరిస్టు కారుకు—మైలుకు ఒక రూపాయి కట్టాలి. ముందు 75 రూపాయలు డిపాజిట్టు కట్టాలి. తిరిగి వచ్చిన తర్వాత రైల్వేఅధికారులు తమ కారు ఏ స్థితిలో అప్పగించబడినదీ చూచుకుని, ఏమయినా మరమ్మత్తు కోరిందంటే — ఆ డిపాజిట్టుద్రవ్యం వినియోగించుకుంటారు. మనం కారును మంచిస్థితిలోనే అప్పగించినా, ఏవో కొన్ని మరామత్తులు చెప్పటం కద్దు. అందుచేత ఆ సొమ్ము తిరిగి రావడము నేడు సులభం కాదు. ఈ సొమ్మే కాకుండా మనం బసచేసే

చోట్ల—దాన్ని ప్రత్యేకంగా యార్డులో ఉంచి, భద్రంగా చూడటానికి—దినానికి ఇంత అని కొంత రుసుం ప్రత్యేకంగా చెల్లించవలసి ఉంటుంది. కారును యార్డులో ఉంచేటప్పుడు టాంకులను నీటితో నింపడమూ, ఫానులకూ లైట్లకూ విద్యుచ్ఛక్తిని సప్లయి చెయ్యడంకోసం బాటరీ ఛార్జి చెయ్యడమూ — మొదలైనవి అధికారులు చెయ్యవలసిన పనులే! అదనంగా చెల్లించే సొమ్ములో వీటి ఖర్చుకూడా ఇమిడే ఉంటుంది. అయినప్పటికీ టాంకులు నింపేవారూ, బాటరీకి కరెంటును ఛార్జి చేసేవారూ ఎప్పటికప్పుడు చేతులు చాచడం మాత్రం విధిగా ఉండే తీరుతుంది.

సాధారణంగా టూరిస్టుకారు—అనగా యాత్రికుల బండి 36 గురు సుఖంగా ప్రయాణం చెయ్యడానికి అనుకూలంగా ఉంటుంది. కాని, అందులో సర్దుకుని మరి కొందరు కూడా ప్రయాణం చెయ్యవచ్చు. ప్రయాణీకులసంఖ్య పెరిగిన కొద్దీ మనిషికి అయ్యేఖర్చు కొంత తగ్గుతుంది. అయినా ఎక్కువ మందిని చేర్చుకుంటే చాలా శ్రమపడవలసివస్తుంది. ఒకసారి అరవై మంది ప్రయాణంచేసి చాలా శ్రమపడినట్లు తెలిసింది. మేము మొత్తం ఏభై యిద్దరం. ముగ్గురు వంటవారూ, ఇద్దరు సేవకులూకూడా ఈ సంఖ్యలోనే చేరి వున్నారు. మాలో ఉపాధ్యాయులసంఖ్యే ఎక్కువ. కొందరు వారి ఆప్తమిత్రులున్నారు. ఏడుగురు మహిళలూ వున్నారు.

టూరిస్టుకారులు వాటి వెనకటి ప్రయాణం ముగించుకొని, కర్మాగారానికి పోయి తగిన మరామత్తులు చేయించుకొని తిరిగి కొత్తగా ముస్తాబయి వచ్చేక మా లీడరుగారూ, ఆతని సహాయులూ వెళ్లి చూచి, అనుకూలమైన 4154

నెంబరు గల కారునే కోరి, అధికారులవద్ద అనుమతిని పొందారు. ఆ కారులోని విశేష మేమిటంటే—మొదటి తరగతి బండ్లవలెనే సీట్లుంటాయి. మధ్య ఖాళీగా ఉంటుంది. అలా ఉండడంవల్ల పంక్తులు తీర్చి భోజనం చెయ్యడానికీ, రాత్రి కాళ్లు చాచుకు పరుండడానికీ సౌకర్యంగా ఉంటుంది.

ఆ కారుకు రెండు చివరలా స్నానాల గదులూ మరుగు దొడ్లూ ఉన్నవి. వాటినానుకుని విశాలమైన హాలువంటి భాగం! ప్రతీ హాలులోనూ ఒక పెద్ద తలుపుల బీరువా, కారుకి మధ్యలో ఒక చిన్న గది! అది మహిళలకు ప్రత్యేకింపబడింది. వారికి ప్రత్యేకంగా స్నానాలకూ వాటికీ సౌకర్యాలున్నవి. ఆ గదికి ప్రక్క ఒకవసారా. దాని ప్రక్కనే వంట గది. దాని ప్రక్క పాత్రలు శుద్ధిచేసే గది. అంటే ఒక హాలుకు కుడిప్రక్క వంట గదీ అవీ వుంటే, మరో హాలుకు ఎడమప్రక్క మహిళలకు ప్రత్యేకింపబడిన గది ఉన్నదన్న మాట! ఈ రెండు భాగాలనూ కలుపుతూ ఒక సన్నని నడవ ఉన్నది. రాత్రిభాగం ఆ నడవలోనే వంటవాళ్ళు పరుండేవారు. మా కారులో నడుమకూడా బెంచీలు ఉంటే అనేక విధాలుగా చిక్కులుపడి ఉందుము. మా లీడరు బాగా ఆలోచించే ఇటువంటి కారు కోరారు.

కారును నిర్ణయించుకున్న తర్వాత, ఆయా స్థలాలలో తిరగటానికి చేయవలసిన ఏర్పాట్లన్నీ జాబుల మూలంగానే చేసుకున్నాం. దీనివల్ల—మేము వెళ్లే ప్రతి స్థలములోనూ మాకోసం మనుష్యులు సిద్ధంగా వుండడమూ, బస్సులు మేము కోరినంత కాలం మాతో వుండడమూ జరిగింది. మా ప్రయాణానికి అనుకూలంగానే, మా బడికి దసరాసెలవులు

ఎక్కువగా ఇయ్యబడినవి. ఈ ప్రయాణం మనస్సులో ఉంచుకొనే పాఠశాలాధికారులు జూన్ నెలలో కొంచెం ముందుగానే బడి తెరవడమూ జరిగింది.

ప్రయాణం ఇంకా రెండు రోజులు ఉందనగానే మాకు ప్రోగ్రాము కాగితాలు అందాయి. అందరూ వీలయినంత తక్కువ సామానుతోనే బయలుదేరాలని సలహా. చాలామంది ఆ సలహాలను పాటించారు.

1956-వ సంవత్సరం సెప్టెంబరు నెల 17-వ తేదీని పగలు పన్నెండు గంటలకు బయలుదేరే గ్రాండ్ ట్రంక్ ఎక్స్‌ప్రెస్సులో ప్రయాణం ప్రారంభించాలనీ, అక్టోబరు 8-వ తేదీ రాత్రికి గాని, 9-వ తేదీ ఉదయానికి గాని తిరిగి మద్రాసు చేరుకోవాలనే మా నిర్ణయం.

# ప్రయాణ ప్రారంభం

సెప్టెంబరు 17-వ తేదీ సోమవారం పగలు పదకొండు గంటలకల్లా మేము సెంట్రల్ స్టేషను చేరుకున్నాము. నేను నా కొద్ది సామానుతో గ్రాండ్ ట్రంక్ ఎక్స్‌ప్రెస్‌కు కట్టబడిన మా పెట్టెను వెతుక్కుంటూ వెళ్లాను. అది ఇంజనుకు ప్రక్కనే ఉన్నది. దానిమీద పెద్ద పెద్ద అక్షరాలతో అచ్చువేసిన కాగితాలు అంటించబడి ఉన్నవి. వాటిమీద "ది కెల్లెట్ హైస్కూల్, ట్రిప్లికేన్, మద్రాస్. టీచర్స్ టూర్ ఆఫ్ నార్త్ ఇండియా" అని వున్నది. అప్పటికే చాలామంది వచ్చి బండీలో ప్రవేశించారు. వందలకొద్దీ విద్యార్థులూ, యాత్రలో చేరని తక్కిన వుపాధ్యాయులూ 'సెన్‌డాఫ్' ఇవ్వడానికి వచ్చారు. నాటిదినం మమ్మల్ని సాగనపంపడానికి వచ్చిన వారికందరికీ—ప్లాట్‌ఫారంమీద టిక్కెట్టు లేకుండానే ప్రవేశం అధికారులచేత అనుమతించబడింది. మా యాత్ర జయప్రదంగా జరగాలని కోరుతూ మద్రాస్ బిషప్ శ్రీ డి. చెల్లప్ప గారు దైవప్రార్థన చేశారు. టీచర్సు గిల్డువారు సభ్యులందరికీ పూవులు సమర్పించారు. హిందూ థియలాజికల్ హైస్కూలు ప్రధానోపాధ్యాయులు శ్రీ ఎస్. బాలకృష్ణజోషీగారు యాత్ర జయప్రదం కావాలని కోరుతూ పెద్ద గంపతో బత్తాయిపళ్లు బహూకరించారు. స్కూలు విద్యార్థుల లీడరు శ్రీ రుక్మాంగదన్ ఆధ్వర్యాన విద్యార్థులు యాత్రకు వెళ్లుతున్న ఉపాధ్యాయుల నందరినీ పూలమాలలు వేసి గౌరవించారు. పాఠశాల

ప్రిన్సిపాల్ రెవరెండు తంబుస్వామిగారు భద్రంగా వెళ్లి రావాలని హెచ్చరించారు. అందరి ముఖాలూ అమితోత్సాహంతో కలకలలాడినవి.

సరిగా పన్నెండు గంటలకు మా బండీ బయలు దేరింది. ఇది ముఖ్యస్థలాల్లో తప్ప తక్కినచోట్ల ఆగదు. మద్రాసు విడిచినతర్వాత గూడూరులోనే ఆగింది. ఈలోపల కొన్ని సరుగుడు తోటలూ, ఎన్నారుదగ్గరి ఉప్పు మళ్లూ, చిన్న నదులూ తప్ప విశేషమైన దృశ్యాలు లేవు. గూడూరు ఒక జంక్షను. ఇక్కడినుంచే ఒక రైను రేణిగుంటమీదుగా కాట్పాడికి వెళ్తుంది. అంటే—ఈ రైను మద్రాసు—కలకత్తా రైనుతో, రేణిగుంటదగ్గర బొంబాయి రైనునూ, కాట్పాడిదగ్గర బెంగుళూరు, మంగళూరులకు పోయే మార్గాన్ని కలుపుతూ ఉందన్నమాట! తిరుపతి ఆ చిన్నరైనులోనే రేణిగుంటకు పక్కనున్నది. ఆ తర్వాత మా బండీ ఆగిన స్టేషను నెల్లూరు. అది పెద్ద పట్టణం. పాడిపంటలతో తులతూగుతూ ఉన్న భూస్వాములకు నిలయం! ఇది పెన్నరు దక్షిణతీరాన ఉన్నది. నదికి పక్కనే శ్రీరంగనాథస్వామి దేవాలయం! నెల్లూరిలో మా బండి మరి కొద్దిసేపే ఆగింది. తర్వాత బిట్రగుంట అనే స్టేషనులో మా ఎక్స్‌ప్రెస్ బండి పావుగంటసేపు ఆగింది. అప్పటికి రమారమి అయిదు గంటలయి ఉంటుంది. అదే మా స్కూలు విద్యార్థి లీడరు రుక్మాంగదుని తండ్రి నివాసం. ఆయన మా పార్టీకంతకూ కాఫీ, ఫలాహారాలు సప్లయి చేశారు. ఆ తర్వాత ఒంగోలు స్టేషనులో మా బండి ఆగింది. ఆ పైని చీరాల, తెనాలి మొదలైన స్టేష

న్లలో ఆగకుండా, రాత్రి ఎనిమిది గంటలకు కృష్ణానది దాటి బెజవాడ చేరుకున్నది.

దక్షిణరైల్వేలో కల ముఖ్యస్థలాల్లో బెజవాడ ఒకటి. ప్లాట్‌ఫారంయొక్క పొడుగునుబట్టి యింత పెద్ద స్టేషను దక్షిణభారతదేశంలో మరెక్కడా లేదని చెప్పాలి. అంతే కాదు. ఉత్తరప్రాంతంలో సోనేపూరులో తప్ప మరెక్కడా ఇంత పొడుగు ప్లాట్‌ఫారం లేదని కలకత్తా డెయిలీలలో— ఒకదానివల్ల ఎప్పుడో తెలుసుకున్నాను. పడమటితీరంలోని మార్మొగోవానుంచి గుంటకల్లుమీదుగా తూర్పుతీరంలో ఉన్న మచిలీపట్నానికి వెళ్లే చిన్నరైను ఈ వూరుమీదు గానే వెళుతుంది. హైదరాబాదు మొదలైనచోట్లకు వెళ్ళే సెంట్రల్ రైల్వే ఇక్కడే మద్రాసు—కలకత్తా రైనుతో కలుస్తుంది. ఇట్టి ప్రాముఖ్యం కల స్థలం కాబట్టే ఇక్కడ మా బండీ ఇరవై నిమిషాలు ఆగింది. ఏ బండి ఇక్కడ ఆగినా, పెట్టెలు సరిగా ఉన్నవో లేవో తనిఖీ చేయడమూ, దొడ్లు శుభ్రం చెయ్యడమూ, టాంకులనిండా నీరు నింపడమూ మొదలైన పనులు జరగవలసి వున్నది. కాని ప్రయాణికులు నోరుగలవాళ్లయితేనే గాని పనివాళ్లు తమ విధులు నెర వేర్చడం అరుదు.

మా కారుకు మూడు టాంకులున్నవి. మద్రాసులో వాటిని పూర్తిగా నింపినారో లేదో! నింపినా చాలా జలం ఖర్చయి వుంటుంది. తెల్లవారేసరికి మాకు స్నానాలకు నీరు కావాలి. బెజవాడ తర్వాతి పెద్దస్టేషను నాగపూరు. నాగపూరు చేరేటప్పటికి పగలు పదిగంట లవుతుంది. అక్కడగాని నీరు నింపే అవకాశం లేదు. అందువల్ల బెజవాడలోనే నీరు

నింపుకోవలసి వున్నది. మా లీడరు నీటి సప్లయిని గూర్చి అధికారికి తెలియజేసి, ఆయన పంపిన మనిషివచ్చేసరికి పావు గంటకు పైగా అయిపోయింది. ఒక టాంకు నిండేసరికి గంట కొట్టారు. ఆ మనిషి బండీ పైభాగంనుంచి దిగిపోయ్యాడు. "ఇవేనా, రైల్వేవారు చేసే సదుపాయాలు? నీరు లేకుండా మేం అవస్థపడవలసినదేనా?" అని శ్రీ సుందరంగారు గద్దించి అడిగారు. "టయిము అయిపోయింది సార్! మేం ఏం చేస్తాము?" అన్నాడా పనివాడు. ఈ ఘర్షణ విని సమీపంలోనే తిరుగుతున్న ఒక అధికారి వచ్చాడు. "మాకు నీటి సప్లయి పూర్తిగా చేసేదాకా బండీని కదలనివ్వం" అని అతనితో గట్టిగా అనగా, "ఈ బండి ఆలస్యంగా బయలు దేరడానికి వీల్లేదు. మీకు దోర్నకల్లులో నీటి సదుపాయం చేయించే బాధ్యత మాది. ముందుగానే అక్కడికి ఫోను చేయిస్తాం. బండిని వెళ్ళనివ్వండి" అని అత నన్నాడు.

బండీ కదిలింది. ఇప్పుడు మేము సదరన్ రైల్వే దాటి సెంట్రల్ రైల్వేలో అడుగు పెట్టామన్నమాట. నిజాం ప్రభుత్వం హయాములో బెజవాడనుంచి వాడీవరకూ, కాజీపేటనుంచి బల్లార్షావరకూ వుండే లైనులు నిజాం స్టేట్ రైల్వేకు సంబంధించినవి. రైల్వేలన్నీ జాతీయం చేయబడి, రెండేసి, మూడేసి రైల్వేలు కలిసిపోయినప్పుడు ఇది సెంట్రల్ రైల్వేగా మారింది.

బండీ కదిలినతర్వాత మేము భోజనాలు ముగించుకొని పడకలు వేసుకున్నాం. బెంచీలు విశాలంగా మెత్తలతో వున్నవి. ఒక్కొక్క హాలులోనూ మీద రెండూ, క్రింద రెండూ—నాలు గేసి బల్ల లుండడంవల్ల, ఒక్కొక్క దాని

మీద సర్దుకుని ముగ్గురు పండుకోడానికి వీలు కలిగింది. క్రింద సర్దుకుని పదిమంది పండుకున్నారు. ఇలా సర్దుకోవడంవల్ల అట్టే శ్రమ లేకపోయింది. ప్రయాణం చేస్తూన్నప్పుడు ఎంత సదుపాయంగా వున్నా నాకు బాగా నిద్రపట్టదు. మేము దోర్నకల్లు జంక్షనుకు వచ్చేసరికి పదకొండున్నర గంట అయి వుంటుంది. మా బండీలో అందరూ గాఢనిద్రలో వున్నారు. నీటికోసం సుందరంగారి కేకలుమాత్రం వినిపించాయి. రైల్వే వారు కాజీపేటలో టాంకులు నింపుతామన్నారు. దోర్న కల్లులో బండి చాలాసేపు ఆగదట!

దోర్నకల్లు కొంత పెద్దస్టేషనే. అక్కడనుంచి సింగరేణి బొగ్గుగనులకూ, భద్రాచలం రోడ్డుకూ బ్రాంచిలైను వున్నది. కాని, ఎక్కువ ప్రాధాన్యం లేని కారణంచేత ఎక్స్‌ప్రెస్ బండ్లు కొద్ది నిమిషాలపాటే అక్కడ నిలుస్తాయి. దోర్నకల్లు తర్వాత బండీ ఆగిన స్టేషను కాజీపేట జంక్షను. హైదరాబాదు, వాడీ మున్నగు స్థలాలకు వెళ్ళేవారు ఇక్కడ లైను మారవలసి వుంటుంది. ఈ స్టేషనుకు ప్రక్కనే సుప్రసిద్ధమైన ఓరుగల్లు—లేక వరంగల్లు స్టేషను వున్నది. అక్కడ బండీ ఆగినతర్వాతనే నాకు తెలివి వచ్చింది. మా పెట్టె ఇంజనుకు ప్రక్కనే వున్నందున—ప్లాట్‌ఫారం చివరిభాగాన్ని మాత్రం చూడగలిగాను. "టాంకులకు నీరు పడుతున్నారు. కిటికీ తలుపులు మూయండి" అనే సుందరంగారి గొంతుమాత్రం వినబడింది. గాలికోసం నేను తెరుచుకొనివున్న ఒక్క కిటికీని వెంటనే మూసివేశాను. తర్వాత తెల్లవారు జామున అయిదు గంటలదాకా ఒక మోస్తరుగా నిద్ర పట్టింది. తెలివి వచ్చి చూచేసరికి మా బండీ వెనక్కు నడుస్తున్నట్లు తోచింది.

ఇంజనుకు ప్రక్క నుండవలసిన మా పెట్టె చివరదిగా అయింది. "మళ్లీ మనం మద్రాసుకే పోతున్నాం" అని ఒకరు తమాషాగా అన్నారు. విశేషం ఏమిటంటే కాజీపేటనుంచి కొంచెం వెనక్కు రావలసి వచ్చినందున ఇంజను బండీచివర తగిలించబడినది. అందువల్ల మా పెట్టె చివరిదైంది. అప్పుడు బండి చిట్టడవులలోంచి ప్రయాణం చేస్తున్నది. రైల్వే గయిడు చూడగా, మేము బల్లార్షాను సమీపిస్తున్నట్లు తెలిసింది. అందువల్ల గోదావరినదిని దాటి వుంటామని అనుకున్నాము.

ఆరుంపావుకల్లా మేము బల్లార్షా చేరుకున్నాం. అప్పటికి ఇంచుమించుగా అందరూ కాల్యకృత్యాలు తీర్చుకోవడం అయింది. కాఫీ, ఫలాహారాలకు సిద్ధంగా వున్నాం. బల్లార్షాలో పాలుదొరికితే ఆ పాలు కాచి, కాఫీ ఇవ్వడానికి శ్రీ రంగారావు ఎదురుచూస్తున్నాడు. పాలు దొరకకపోతే పౌడరుపాల కాఫీ ఈయదలుచుకున్నాడు. అదృష్టవశాత్తూ మంచిపాలే దొరికాయి. కాని వెలమాత్రం మద్రాసులోకంటే అధికమే అనిపించింది.

బల్లార్షా చిన్న స్టేషను! అక్కడ మా బండీ అయిదు నిమిషాలే ఆగింది. దాని ప్రక్కస్టేషను చాందా. ఇది చాందా జిల్లాకు ముఖ్యపట్టణం. స్టేషను చిన్నదే అయినా ప్రాముఖ్యం వున్నది. ఇక్కడి చాందా ఫోర్టు స్టేషనునుంచి ఆగ్నేయ రైల్వేకు చెందిన నేరోగేజి లైను నాగభీర్ మీదుగా నాగపూరునకూ, గోండియాకునూ వెళుతుంది. గోండియా నాగపూరుకు తూర్పుగా బొంబాయి—కలకత్తా లైనుమీద వున్న జంక్షను.

మేము కాఫీ, ఫలాహారాలు పూర్తిచేసుకున్నాం.

తర్వాత మాలో సంగీత నిపుణులు కొందరు పిడేలు, ఫ్లూటు, కంజీరా మున్నగు వాద్యాలతో గంటసేపు సంగీత కచేరి జరిపారు. తొమ్మిది గంటలకు మా బండీ వార్ధా జంక్షనుకు వచ్చింది.

వార్ధా చరిత్రప్రసిద్ధమైన స్థలం. ఇదివరకు మధ్య ప్రదేశంలో వుండి, ఈ నడుమనే బొంబాయిరాష్ట్రంలో కలిసింది. ఇది జిల్లా ముఖ్యపట్టణం. దీనికి సమీపంలోనే గాంధిమహాత్ముడు ఏర్పరచిన ఆదర్శనగరం సేవాగ్రామ్ వున్నది. నూతన పద్ధతిలో విద్యాభ్యాసం చేయించే వార్ధా స్కీము ఇక్కడనే ఏర్పాటయింది. నూలాధారం విద్య నేర్పే వుపాధ్యాయు లిక్కడనే తర్ఫీదుపొందుతూ వుంటారు. ఇది బొంబాయినుంచి కలకత్తాకు వెళ్లే మెయినులైనుమీద వున్నది. ఇక్కడనుండి మా బండీ తూర్పుగావున్న నాగపూరు వెళ్ళవలసి వున్నది. కనుక ఇంజను మళ్లీ మా పెట్టెపక్కనే తగిలించబడింది.

ఇక్కడనుంచి నాగపూరు ఏభయి మైళ్లు. ఇంత దూరమూ మా బండి గంటంపావులో పోగలిగింది. కారణం ఏమంటే ఇక్కడినుంచి నాగపూరు వరకు రాకపోకలకు రెండు లైనులు వున్నవి. బొంబాయినుంచి నాగపూరు వరకూ డబుల్ లైనులు వెయ్యబడినవి! అందువల్ల ఎదురుగా వచ్చే బండ్ల ఆటంకం లేనందున ప్రయాణం చురుకుగా సాగుతుంది. నాగపూరు వరకూ మా బండీ మార్గమధ్యంలో మరెక్కడా ఆగడంలేదు. మేము సరిగా పది గంటల పది హేను నిమిషాలకు నాగపూరు చేరుకున్నాము.

నాగపూర్ ఒక పెద్ద జంక్షన్ స్టేషన్. కలకత్తానుంచి

బొంబాయికి వెళ్లే రైలు ఈ పూరిమీదుగా వున్నది. కలకత్తానుంచి ఇక్కడివరకూ ఆగ్నేయరైల్వే; ఇక్కడి నుంచి బొంబాయికిసెంట్రల్(మధ్య) రైల్వే, మధ్యరైల్వేలోని మరొక శాఖ ఇక్కడినుండి ఉత్తరంగాపోయి ఢిల్లీ చేరుతుంది. ఈ నగరంలో చేరిన ఇట్వారీనుంచి ఆగ్నేయ రైల్వేయొక్క శాఖామార్గం ఒకటి రామ్ టెక్ అనే క్షేత్రానికి వెళ్ళుతుంది. అంతేకాక చాందానుంచి బయలుదేరిన నేరోగేజి లయిను ఇక్కడకు వచ్చి, ఇక్కడ నుంచి నైనిపూర్ వెళ్లుతుంది.

1956 అక్టోబర్ చివరిదాకా నాగపూర్ మధ్య ప్రదేశమునకు ముఖ్యపట్టణంగా వుండేది. రాష్ట్రాల పునర్విభాగం కారణంగా, ఇది ఇప్పుడు బొంబాయి రాష్ట్రంలో కలిసిపోయి, భోపాల్ అనేది మధ్యప్రదేశానికి ముఖ్యనగరమైంది. నాగపూర్ మహారాష్ట్రులు ఎక్కువగా వున్న పెద్ద పట్నం. ఇక్కడ ఒక విశ్వవిద్యాలయం వున్నది. తరతరాల నుంచీ ఇక్కడ స్థిరనివాసం కల్పించుకున్న ఆంధ్రులు చాలా మంది వున్నారు. వ్యాపారంలో వారిది పై చేయి! నాగపూర్ విశ్వవిద్యాలయానికి పది లక్షలకు పైగా భూరివిరాళం ఇచ్చిన స్థానిక వర్తకప్రముఖులు శ్రీ లక్ష్మీనారాయణగారు ఆంధ్రులే అని విన్నప్పుడు మనం గర్వించవలసినదే కదా!

నాగపూర్‌లో మా బండి ఆగడంతోనే మద్రాసులోని బి. జి. పాల్ అండ్ కో అనే గ్రంథ ప్రకాశక సంస్థ వారి స్థానికాధికారులు మమ్మల్ని కలుసుకొని మా యాత్ర నిర్విఘ్నంగా జరగాలని కోరుతూ ఆ పూట ఆతిథ్యం ఇచ్చే బాధ్యత తమదే అని చెప్పి అందరికీ తాము తయారుచేయించి తెచ్చిన పులుసన్నము, పెరుగన్నము, పూరీలూ, బంగాళా

దుంపలకూరా అవీ ఇచ్చారు. ఈ సంగతి మాకు ముందుగానే తెలుసును. అందువల్ల ఆ పూట మా పాచకులకు విశ్రాంతి లభించింది. మేము అప్పుడు పూరీలు తీసుకొని, వారు సప్లయి చేసిన కాఫీ త్రాగి, పన్నెండు గంటలకు భోజనం చేశాము. నాగపూర్‌లో పనివారు మా పెట్టె శుభ్రం చేసి, టాంకుల నిండా నీరు నింపారు. పదీ, ముప్పయి ఐదు నిమిషాలకు మా బండీ అక్కడనుంచి బయలుదేరింది. బి. జి. పి. ఎల్ కంపెనీ అధికారులకు కృతజ్ఞత తెలుపుతూ మేము నాగపూర్ విడిచిపెట్టాము. ఈ యాత్రలో మా ప్రధాన గమ్యస్థానం ఢిల్లీ. ఢిల్లీ చేరేలోగా మేము ఆగ్రాలోను, మథురలోను దిగి అక్కడి విశేషాలు చూడదలుచుకున్నాము. ఢిల్లీకి మద్రాసుకూ నాగపూర్ సరిగా మధ్యను వున్నది. మేము ఢిల్లీ చేరాలంటే ఇంతవరకూ వచ్చినంత దూరం వెళ్ళాలన్న మాట.

మేము కాటోల్ అనే స్టేషన్‌కు వచ్చేసరికి భోజనాలు పూర్తి అయినవి. ఆ తర్వాత మా బండీ పీఠభూములమీదా, కొండలమీదా ప్రయాణం చెయ్యవలసి వున్నది. ఇకమీద కొన్ని కొండల రంధ్రాలలోంచి (టన్నల్స్) ప్రయాణం చెయ్యవలసి వుంటుందనీ, చేతులు కిటికీలలోంచి పైకి పెట్టకుండా వుండాలనీ ఒక రైల్వే వుద్యోగి హెచ్చరించాడు.

కొండల వరుస మార్గానికి అడ్డంగా వచ్చినప్పుడు, కొండకు రంధ్రంచేసి, ఆ రంధ్రంలోంచి రైలుమార్గం వేస్తారు. కాటోల్‌నుంచి ఆమ్లా జంక్షను చేరేలోగా మేము చాలా కొండలక్రింద నుంచి ప్రయాణం చేయవలసివచ్చింది. సరిగా మూడు గంటలకు ఆమ్లాజంక్షను వచ్చింది. తపతీనదిని

దాటినతర్వాతనే మేము ఇక్కడికి చేరుకున్నాము. ఇక్కడి నుంచి పరాసియా అనే చోటుకు ఒక బ్రాంచిలైను వెళ్ళుతుంది. అప్లాలో మా బండి పావుగంట ఆగినది. తర్వాత మేము చాలా కొండలూ, అడవులూ, వాగులూ దాటి ఆరు గంటలకు ఇటార్సీ జంక్షను చేరాము.

సెంట్రల్ రైల్వేలో ఇటార్సీ ప్రధానమైన స్థలం. ఇక్కడనుంచి నైరుతిదిశగా భూసవాల్ అనే చోటుకు డబుల్ లైను మార్గం వున్నది. భూసవాల్ కలకత్తా—బొంబాయి లైనులో వున్న జంక్షన్. మరొక లైను, ఇటార్సీనుంచి తూర్పుగా జబల్‌పూర్, కట్నీలమీదుగా అలహాబాదుకు చేరుతుంది. కలకత్తానుంచి గయమీదుగా వచ్చే తూర్పు రైల్వేవారి బొంబాయిమెయిలు అలహాబాద్, ఇటార్సీల మీదుగానే బొంబాయికి వెళ్లుతుంది.

ఇటార్సీలో మా బండి ఇరవై నిమిషాలు ఆగినది. అక్కడ తిరిగీ మేము టాంకులు నింపుకొన్నాము. అక్కడ నుంచి బండీ బయలుదేరిన తర్వాతకూడా మేము కొండలపైని ప్రయాణం చెయ్యవలసి వచ్చింది. కొన్ని కొండ టన్నల్సులో దూరి వెళ్లవలసి వచ్చింది. కాటోల్‌నుంచి భోపాల్ జంక్షన్‌కు వెళ్ళేవరకూ మొత్తం పదమూడు టన్నల్స్‌లో మా ప్రయాణం జరిగింది. చెప్ప మరిచాను. ఇటార్సీ దాటిన కొద్దికాలంలోనే సుప్రసిద్ధ నది అయిన నర్మదను దాటినాము. అది మధ్యభారత పర్వతాల్లో పుట్టి పడమటిదిక్కుగా పారి, అరేబియా సముద్రంలో కలిసే నదులలో ఒకటి. తపతికూడా ఇట్టిదే! కాని నర్మదకంటే అది చిన్నది!

రాత్రి ఎనిమిది గంటలకు మేము భోపాల్ జంక్షనుకు

వచ్చాము. ఇప్పుడు భోపాల్ మధ్యప్రదేశానికి ముఖ్యపట్నం. ఇక్కడినుంచీ ఉజ్జయినిమీదుగా పశ్చిమ భారత దేశానికి ఒక మార్గం వున్నది. తర్వాత రాత్రి పదిన్నరకు బినాజంక్షను వచ్చినది. ఇక్కడనుంచి వాయవ్యదిశగా కోటకు ఒక శాఖా మార్గమూ, తూర్పుగా కట్నీకి ఒక మార్గమూ వున్నవి. పెద్ద జంక్షను కావడంవల్లనే దీనికి ప్రాముఖ్యం వచ్చింది కాని స్థలాన్ని బట్టి కాదు.

రాత్రి ఒంటిగంటకు మా బండీ ఝాన్సీ చేరినది. అది చరిత్ర ప్రసిద్ధమైన స్థలం. పెద్ద రైల్వే జంక్షను. ఇంత ఆకర్షణీయంగా వున్న స్టేషనూ, విశాలంగా వున్న రైల్వే యార్డూ మరెక్కడా కానరావని చెప్పవచ్చు. ఇక్కడినుంచి ఒక లైను తూర్పుగా పోయి మాణిక్‌పూరుమీదుగా అలహాబాదు చేరుతుంది. మరొక్కటి ఈశాన్యదిక్కుగా పోయి కాన్పూరు చేరుతుంది. ఇండియా స్వాతంత్ర్యపోరాటంలో ముందంజ వేసి, వీరులకు మార్గం చూపిన వీరనారీమణి రాణి లక్ష్మీబాయి వల్ల ఝాన్సీ ప్రపంచంలోకల్లా ప్రసిద్ధికెక్కింది. ఝాన్సీ దాటిన తర్వాత గ్వాలియర్ వచ్చింది. అప్పటికి రెండు మ్నువ్వావు అయి వుంటుంది. గ్వాలియర్ కూడా ఒక జంక్షనే! ఇక్కడినుంచి చిన్న లైనులు సేవాపూర్, శివపురి మున్నగు చోట్లకు వున్నవి. ఈ వూరిలోని కోట చూడదగినదట! కాని, మా ప్రోగ్రాములో ఝాన్సీ, గ్వాలియర్‌లు చేర్పబడనందున మేము ఆ యా చోట్లలో దిగి, అక్కడి విశేషాలు చూడడానికి అవకాశం లేకపోయినది.

# అప్రఖ్యాత కళాఖండాల ఆగ్రా

తెల్లవారుజాము నాలుగున్నర గంటలకు మేము ఆగ్రా కంటోన్మెంట్‌కు వచ్చాము. మా మొదటి మజిలీకూడా ఆగ్రాపట్టణమే! అక్కడ బండీ పది నిమిషాలే ఆగుతుంది. ఈ లోగా మేము స్టేషన్ మాస్టర్‌తో చెప్పి మా పెట్టెను విడదీసియుంచి, యార్డులో తగినచోట వుంచేటట్లు ఏర్పాటు చేయించుకోవాలి. మా రాకనుగూర్చి, మా టూరిస్టు కారును డిటాచ్ చెయ్యడాన్నిగూర్చి, ముందుగానే ఆ యా స్టేషనులకు తాఖీదులు వెళ్ళాయి. అందువల్ల మేము వేరే చెప్పనక్కర్లేకుండానే రైల్వే అధికారులు తమ ధర్మాన్ని నెరవేర్చవలసి వున్నది. కాని, అలా జరగడమనేది చాలా చోట్ల కానరాదు. బండి ఆగిన వెంటనే మా లీడరు స్టేషన్ మాస్టర్ వద్దకు త్వరగా పోయి తమ పార్టీ వచ్చిన సంగతి తెలుపుతూ, కారును బండీనుంచి తప్పించాలని అడుగగా, ఆయన "ఓహో! అలాగా! మీరు వచ్చారా!" అని ఏమీ ఎరగనట్లే మాట్లాడాడు, తన టేబిల్ మీద ప్రోగ్రాం కాగితం పెట్టుకునీ కూడా. మా లీడరుకు ఆశ్చర్యం కలిగింది. అతడు స్టేషన్ మాస్టర్‌తో చెప్పకపోతే మేము ఆగ్రా దాటిపోయి మథుర చేరివుందుము. కాని, అదృష్టవశాత్తు అలా ఏమీ జరిగి వుండలేదు. తర్వాత మా పెట్టెను బండినుంచి విడదీసి, స్టేషన్‌కు కొంచెం దూరంగా యార్డులో వుంచారు. మేము అవసరాలు తీర్చుకుని, కాఫీ ఫలాహారాలు తీసుకుని వూళ్ళోకి వెళ్ళడానికి

సిద్ధంగా వున్నాము. మా ప్రోగ్రాం ప్రకారం గవర్నమెంట్ బస్సు స్టేషన్‌కు వచ్చి, మమ్మల్ని ఆ యా స్థలాలకు, తీసుకొని వెళ్ళవలసివున్నది. అది వచ్చేదాకా మేము స్టేషనులో కొంచెం సేపు గడిపినాము.

ఆగ్రా స్టేషన్ పెద్ద జంక్షనులలో ఒకటి. కాన్పూరు నుంచి టూండ్లామీదుగా వచ్చిన పెద్ద లైను ఇక్కడ కలుస్తుంది. ఇక్కడినుంచి నైరుతిమూలగా కోటకు మరొక పెద్ద లైను వున్నది. అంతేకాకుండా ఇక్కడనుంచి మధురకూ, జయపూర్‌నకూ ప్రత్యేకంగా చిన్న లైనులు రెండున్నవి.

సరిగ్గా ఏడుగంటలకు మా బస్సు వచ్చింది. ఆ బస్సు రాత్రి పదివరకూ మా స్వాధీనంలో వుండగలందులకు ఏర్పాటు జరిగింది. మేము ముఖ్యంగా చూడదలచిన స్థలాలను తెలుసుకుని, ట్రాన్స్‌పోర్ట్ అధికారులు డ్రయివర్‌కు—ఎలా తీసుకొని వెళ్ళవలసినదీ తెలిపారు. ఆ డ్రయివర్ చాలా శాంతమైన వాడు. మేము ఏమి అడిగినా విసుక్కోకుండా సమాధాన మిస్తూ విశేషాలన్నీ తెలిపేవాడు.

మేము ఆగ్రాలో ఫతేపూర్ శిక్రీ, సికంద్రా, అక్బరు కోట, దయాల్‌బాగు, తాజ్‌మహల్ చూడగోరినాము. ఉదయం ఫతేపూర్ శిక్రీ, సికంద్రాలుచూచి, స్టేషనుకు వచ్చి భోజనాలైన తర్వాత తక్కినవి చూడదలిచాము.

మేం మొదట్లో ఆగ్రాకు ఇరవై మూడు మైళ్ళకుపైగా ప్రయాణంచేసి ఫతేపూర్ శిక్రీకి వెళ్లాము. అక్బరుచక్రవర్తి గుజరాతును జయించిన తర్వాత తన విజయచిహ్నంగా ఈ నగరాన్ని నిర్మించాడట! ఇది ఒక చిన్నగుట్టపై కట్టబడినది. శిక్రీ అనేది ఈ స్థలానికి మొదట వున్న పేరు. ఫతేపూర్

అనగా విజయపట్టణం! దీని విస్తీర్ణం రమారమి ఏడు మైళ్ళు.

దీన్నిగురించిన చరిత్ర ఒకటి ప్రసిద్ధంగా వున్నది. శిక్రీ అనే ఈ స్థలంలో ఒక గుహాలో షేక్ సలీం చిస్టీ అనే ఫకీరు— గొప్ప శక్తులు కలవాడు వుండేవాడు. ఇతనియందు అక్బరు చక్రవర్తికి గొప్ప గౌరవం. ఇతని దీవనవల్లనే అక్బరుకు కుమారుడు కలిగినాడట! ఈ మతగురువుపై గల గౌరవం కారణంగా తన కుమారునికి అక్బరు, 'సలీం' అనే పేరు పెట్టాడు. అప్పుడు అక్బరు రాజధానిఆగ్రా. చక్రవర్తి సలీం చిస్టీని ఆగ్రాలో నివసింపవలసినదిగా కోరాడట! కాని అతడు దాని కిష్టపడనందున చక్రవర్తి తన రాజధానినే శిక్రీకి మార్చుకొన్నాడట! ఆ కారణంవల్ల శిక్రీ ఒక పెద్ద నగరంగా తయారైంది.

ఆగ్రానుంచి బయలుదేరి తొమ్మిదిగంటలకు మేము ఫతేపూర్ శిక్రీ చేరుకున్నాము. ఆ గుట్ట పై భాగం ఎక్కడం కొందరికి కొంచెం శ్రమగానే తోచింది. కాని వుత్సాహం కొద్దీ వారు శ్రమను వ్యక్తం చేయలేదు.

ఫతేపూర్ శిక్రీలో ముఖ్యమైన మందిరాలు తప్ప తక్కిన భాగం చాలా శిథిలమైవున్నా, వెనుకటికాలంలో ఇది ఎంత గొప్పగా వుండేదీ వ్యక్తంచేస్తూ వుంది. 1570 నుండి 1585 వరకూ ఈ నగరం అక్బరు చక్రవర్తికి రాజధానిగా వుండినది. దీని సమగ్ర స్వరూపం ఒక్కసారే ఏర్పడలేదు. అప్పుడప్పుడు కొత్తకొత్త నిర్మాణాలు అవతరించి దీని ప్రశస్తిని పెంచినట్లు కనబడుతున్నది. దీని ప్రాకారం ఎంతో ఎత్తుగా, ఎనభై అడుగులకు పైగా వుండి చాలా బలిష్ఠంగా వుంది. సింహ ద్వారానికి సమీపాన ప్రాకారానికి ప్రక్కగా ఒక పెద్ద దిగుడు

బావి వున్నది. మేము లోపలికి ప్రవేశించబోగా మా గయిడు ఆ దిగుడుబావివద్దకు పిల్చుకుని వెళ్లి, ఒక వింతదృశ్యం చూడ గలరని చెప్పాడు. ఏమంటే— ప్రాకారంమీద ఒక వస్తాదు నిలిచివున్నాడు. అంత ఎత్తునుంచీ ఆ వస్తాదు దిగుడు బావిలోకి వురకుతాడనీ, ఆ దృశ్యం చూచినందుకు ఒక రూపాయ ఇవ్వాలనీ అతడు చెప్పాడు. సొమ్ము ఇవ్వడానికి మా లీడరు సమ్మతించిన వెంటనే ఆ గజయీతగాడు బావిలోకి వురికి ఒక నిమిషంలో బయటికి వచ్చి తన బహుమానాన్ని తీసుకుని వెళ్లి పోయాడు.

తర్వాత మేము విశాలమైన ద్వారంలోంచి లోపలికి ప్రవేశించాము. కొంతదూరం వెళ్లేసరికి నౌబత్ ఖానా వచ్చింది. రాజభవనాల ఆవరణలోకి వెళ్లాలంటే దీనిగుండా పోవాలి. నౌబత్ ఖానా అనగా వాద్యనిలయం. నిత్యాలూ, నైమిత్తికాలూ అయిన వుత్సవాల సమయాలలోనూ, నియమిత కాలాలలోనూ ఇక్కడనుండి మంగళవాద్యాలు ప్రయోగింప బడుతూ వుంటాయి.

ఇక్కడున్న భవనాలలో ముఖ్యమైంది జామామసీదు. దిఇ చతురప్రాకారం కలది. దీని ద్వారం చాలా ఆకర్ష ణీయంగా వుంటుంది. ఇది షేక్ సలీం చిస్టీ జ్ఞాపకార్థం క్రీ. శ. 1571 లో అక్బరుచక్రవర్తి కట్టించింది. ఇంత పెద్ద మసీదు ఇండియాలో మరెక్కడా లేదట! దీని లోభాగం నీలవర్ణంతోనూ, బంగారుతోనూ చిత్రింపబడి వున్నది. దీని నిర్మాణానికి అయిదు లక్షల రూపాయలు ఖర్చయినవట! ఈ జామామసీదుకు దక్షిణంగా బులంద్ దర్వాజా అనే పెద్ద ద్వారం వున్నది. దీని ఎత్తు 176 అడుగులు. ఇక్కడినుంచి

చూస్తే తాజ్ మహాలు స్పష్టంగా కనిపిస్తుంది. ఇంత ఎత్తయిన ద్వారం భారత దేశంలో యిదేనట! ఈ ద్వారం మొదట్లోనే నిర్మించలేదు. అక్బరుచక్రవర్తి దక్కను జయించిన తర్వాత దానికి చిహ్నంగా దీన్ని నిర్మించినట్లు తెలుస్తున్నది.

జామామసీదులో ఒక వైశిష్ట్యం వున్నదట! ఈ మసీదులో వున్నప్పుడు ఏదయినా కోరిక కోరుకుంటే తప్పకుండా నెరవేరుతుందనే చాలామందికి నమ్మకం. సంతానంలేనివారు బిడ్డలకోసం యిక్కడ ప్రార్థిస్తూ వుంటారు!

అక్బరుసార్వభౌముడు 1581 లో కట్టించిన షేక్ సలీం చిస్టీ గోరీ, చిస్టీ మనుమడైన ఇస్లాంఖాన్ గోరీ, యిక్కడి సుందరదృశ్యాలలో చేరినవి. వీటినిబట్టి అక్బరు చక్రవర్తికి సలీం చిస్టీ పైని ఎంత భక్తీ, గౌరవమూ వుండేదీ స్పష్టమవుతూ వుంది.

వ్యక్తులమీదనే కాకుండా జంతువులమీదకూడా ఆ మొగలుచక్రవర్తికి ఎట్టి ప్రేమో యిక్కడి హీరాన్ మీనారు అనే స్మృతిచిహ్నంవల్ల స్పష్టమవుతున్నది. హీరాన్ అనే పేరుగల తన ప్రియమైన ఏనుగు చనిపోగా—దాని జ్ఞాపకార్థంగా ఈ స్తంభం నిర్మించబడింది. ఈ స్తంభం యావద్భాగమూ ఏనుగు దంతాల ఆకారంగా చెక్కబడిన శిలలచే అలంకరింపబడి వున్నది.

ఇలాంటి స్మృతిచిహ్నాలూ అవీ కాకుండా సుందరభవనాలుకూడా కొన్ని వున్నవి. వాటిలో జోద్‌భాయి భవనం, బీరబల్ భవనం, టర్కిష్‌రాణి భవనం, పంచమహాల్ మున్నగునవి ఆకర్షణీయంగా వున్నవి.

అక్బరుచక్రవర్తి, తన కుమారుడైన సలీం హిందూ

భార్య అయిన జోద్ భాయి నివసించడానికి ఒక పెద్దభవనం కట్టించాడు. ఆ విధంగానే ఆయన మంత్రీ, ఆస్థాన విద్వాంసుడూ అయిన వీరబల్ తన కుమార్తెకోసం కట్టించిన భవనమూ ఆకర్షణీయంగానే వుంటుంది. వీటి అన్నింటికంటె అందమైంది టర్కిష్ రాణి మందిరం! అందులోని శిల్పసంపద ప్రశంసించదగినది.

పంచమహాల్ అనేది అయిదు అంతస్థుల మేడ. ఇందులో ఒక అంతస్తుకన్న మరో అంతస్తు ఎత్తు తక్కువ. పైగా ఒకదానికంటె యింకొకటి చిన్నది! మొదటి అంతస్థులో ఇరవై నాలుగు స్తంభాలున్నవి. ఒక్కొక్క స్తంభమూ విభిన్నమైన శిల్పంతో ఆకర్షణీయంగా వుంటుంది. ఒక స్తంభాన్ని పోలి మరొక స్తంభం వుండదు. ఇది అక్బరు చక్రవర్తి విలాసార్థం ఏర్పరచుకొన్న భవనం!

ఈ 'పంచమహాలు'ను ఆనుకొని విశాలమైన ఆవరణలో పచ్చీస్ పాళీ శాశ్వతంగా ఎర్రరాళ్ళ గచ్చుపై నిర్మించబడి వున్నది. ఇందులోని ఒక్కొక్క గడీ నాలుగేసి చదరపు టడుగుల విస్తీర్ణం కలిగివున్నది. దీనికి మధ్యను ఎత్తుగా ఒక రాతిపీఠం వున్నది. అక్బరు చక్రవర్తి యిక్కడ కూర్చుండి, రాణులు తమ చెలికత్తెలతో పచ్చీస్ పాళీ ఆట ఆడుతూ వుండగా చూస్తూ వుండేవాడు. మనం ఆటలో పావులను నడిపినట్లు ఇందులో రాణులూ, చెలికత్తెలూ గళ్లలోకి నడిచేవారు. ఒక్కొక్కప్పుడు చక్రవర్తే పావులను నడిపించేవాడు. ఇలా ఆడించడం ఆతని కెంతో ఇష్టం.

ఈ క్రీడాస్థలానికి ఇరవై గజాల దూరంలో కొన్ని విరామశాలలు వున్నవి. ఎండగా వున్నప్పుడు చక్రవర్తీ, అతని

రాణులూ ఇక్కడ వుండి, బానిస బాలికల చేత ఈ ఆట ఆడించి చూచేవారట! ఆ బాలికలను ఈ ఆటలో బాగా తరిఫీదు చేసేవారట! ఆ బానిస బాలికలు గజ్జెలుకట్టుకొని గదులలోకి నాట్యం చేస్తూపోతూ వుండడం ఎంతో ఆకర్షణీయంగా వుండేదట!

దివాన్-ఇ-ఖాస్ అనే ఎర్రటి మందిరం దూరంనుంచి చూడడానికి రెండంతస్తుల మేడలాగా కానవస్తుంది. కాని లోపలికి పోయి చూస్తే మామూలుగానే వుంటుంది. ఇందులోని విశేష మేమంటే—ఈ భవనం మధ్యను ఒక ఎర్రరాతి స్తంభం వున్నది. ఆ స్తంభానికి పైగా నాలుగువైపులా నాలుగు కాల్వలవంటి మార్గాలూ, ఆ మార్గాల కెదురుగా ఒక్కొక్క ఆసనం వుంచడానికి స్థలమూ వున్నవి. స్తంభం మధ్యభాగాన సింహాసనంమీద అక్బరుచక్రవర్తి కూర్చుండేవాడు! నాలుగు వైపులా నలుగురు మంత్రులు కూర్చుండేవారు! చక్రవర్తి రహస్యాలోచనలన్నీ ఇక్కడనుండే జరిపేవాడట!

ఇక్కడి భవనాలనూ, అంత ఎత్తయిన ప్రదేశంలో ఏర్పరచిన నీటి సదుపాయాలనూ గమనించి చూస్తే అప్పటి శిల్పశాస్త్రజ్ఞుల ప్రతిభావిశేషాలు వ్యక్తమవుతూ మిక్కిలి ఆశ్చర్యాన్ని కలిగిస్తాయి. అక్కడున్నంతసేపూ ఏదో కొత్త ప్రపంచంలో వున్నట్లు తోచింది. మేము ఆయా స్థలాలలో—తీసుకోవలసిన చోట ఛాయాచిత్రాలను తీసుకున్నాం. మా పాఠశాల కెమెరాక్లబ్ అధినేత శ్రీ పార్థసారథిగారు ఎప్పటి కప్పుడు కెమెరాతో సిద్ధంగా వుండేవారు.

మేం మెల్లగా ఆ గుట్ట దిగి బస్సు చేరుకున్నాము. అప్పటికి మామూలు ప్రపంచంలో పడ్డట్టు అనిపించింది. ఎండ

తీక్ష్ణంగా వుండి, బాధ కలిగించింది. కాని, వుత్సాహంతో అందరమూ దాన్ని సహింపగలిగాము. తర్వాత మేము సికంద్రాకు బయలుదేరాము. అది అక్బరుచక్రవర్తి సమాధి వున్న చోటు. ఆగ్రానుంచి మధురకు వెళ్లే దారిలో— ఆగ్రా పట్టణానికి నాలుగు మైళ్ల దూరంలో ఇది వున్నది. ఇందలి అక్బరు గోరీ పాలరాతితో నిర్మించబడింది. గోరీకి వెళ్లే మార్గం పైని బంగారు అలంకారాలు వున్నవి. సికంద్రాను చూచి మేము తిన్నగా మా టూరిస్టుకారు చేరుకున్నాము. అప్పటికి ఒంటిగంటకు పైగా అయింది. స్టేషన్ మాస్టర్ మాకు అనుకూలంగా వుండేటట్లు మా కారును ప్లాట్‌ఫారంమీదకు తెప్పించి, టాంకులనిండా నీరు పట్టించి పై భాగాన్ని బాగా కడిగించాడు. మాకు ఎక్కువ ఆకలిగా వున్నది. వంటవారు విశాలంగా వున్న ప్లాట్‌ఫారంమీదనే ఆకులు వేసి, త్వరగా వడ్డించినారు. అరగంటలోగా అందరి భోజనాలూ పూర్తి అయినవి. తర్వాత అరగంటసేపు విశ్రాంతి తీసుకోవడానికి మాకు అవకాశం కలిగింది.

కొంచెంసేపు విశ్రాంతి తీసుకున్నాక మేం మళ్లీ బయలుదేరాము. మా బస్సు స్టేషను దగ్గరే ఉన్నది. డ్రయివరు కూడా బస్సులోనే ఉన్నాడు. ఎంత పిలిచినా భోజనానికి రాలేదు. తాను ఉదయమే భోజనం చేశాననీ, రాత్రి తొమ్మిది దాకా దాకా మరేమీ అక్కర లేదనీ చెప్పి అతడు మా రాకను ఎదురు చూస్తూ బస్సులోనే కూర్చునివున్నాడు. ఆ తర్వాత మేము ఆగ్రాలో ఒక చివర ఉన్న దయాల్‌బాగుకు వెళ్లాం.

దయాల్‌బాగు ఒక విశాలమైన స్థలం. అక్కడ సత్సంగ మతానికి సంబంధించిన రాధాస్వామిజీ అనుయా

యుల బసలూ, విద్యాలయాలూ, పరిశ్రమలూ ఉన్నవి. దయాల్ బాగు ఉత్తర దేశంలో ప్రసిద్ధమైనట్లు తోచదు. దక్షిణాదినే దాని ప్రతిష్ఠ ఎక్కువ. ఆంధ్ర దేశంలో రాధాస్వామి అనుయాయులు చాలామంది ఉన్నారు.

దయాల్ బాగులోని దృశ్యాలూ, పరిశ్రమలూ చూడడానికి అనుమతిపత్రాన్ని ముందుగానే సంపాదించాలి. మేము దాన్నిదివరకే సంపాదించి ఉండడంవల్ల ఎక్కువ శ్రమ లేక పోయింది. అక్కడ ఏవేవి చూడదగినవో మా డ్రయివరకు కూడా తెలియదు. నిజానికి దానికి ప్రాముఖ్యంఇవ్వడం అతనికే కొంత ఆశ్చర్యం కలిగించినట్లు బోధపడింది. మేము ఆ ప్రాంతానికి వెళ్లి అడుగగా—సత్సంగు లుండే బస చూపారు. అక్కడ అడిగి దయాల్ బాగు పరిశ్రమల కేంద్రానికి వెళ్లాం. అక్కడ అంతగా చూడవలసిన విశేషాలు కానరాలేదు. నేత పని మాత్రం ఒకచోట జరుగుతున్నది. యుద్ధసమయంలోనే ఉత్పత్తి ఎక్కువగా ఉండినట్లూ, ఇప్పుడు తగిన ప్రోత్సాహం లేనట్లూ అక్కడివారు చెప్పారు. అక్కడి లెదర్ వర్క్సు పేరుపడినవి. కాని, వాటికీ తగిన ప్రోత్సాహం లేదట. షో-రూములలో ఉంచిన వస్తువుల వెలలు చూస్తే—అవి సామాన్యులకు ఏ రీతిగానూ అందుబాటులో ఉండేటట్లు తోచ లేదు. మొత్తంమీద మా పార్టీలోని అందరికీ దయాల్ బాగు కొంత నిరుత్సాహాన్నే కలిగించిందని చెప్పాలి.

తర్వాత మా బస్సు ఆగ్రా వీథులలోంచి ప్రయాణం సాగించినది. అది పెద్ద పట్టణమే గాని, ఏవో కొన్ని స్థలాలు తప్ప తక్కిన భాగాలు చాలా ఇరుకుగానూ, మురికిగానూ ఉన్నట్లు తోచినది. ప్రజలు కొంత బాధ్యత వహిస్తే తప్ప

ఏ నగరమూ పరిశుభ్రంగా ఉండదుకదా!

పెద్ద పెద్ద బజారులుండే వీథులుకూడా చాలా యిరుకుగా ఉండి, బస్సు ప్రయాణం చెయ్యడమూ, ఎదురుగావచ్చే శకటాలనూ, జనాన్నీ తప్పుకోవడమూ కష్టంగానే ఉంటుంది. మా బస్సు మెల్లగా ప్రయాణం చేస్తూ ఒక మలుపుదగ్గర టపీమని ఆగింది. కారణం కనుక్కోగా మా బండీ కొంచెం మలుపు తిరిగి, ప్రక్కనే వున్న యమునానది బ్రిడ్జిపైనుండి వెళ్లాలి. ఆ వంతెన చాలా ఇరుకైనది. ఒకవైపు ప్రయాణమే సాధ్యం. పది నిమిషాలపాటు అటునుంచి ఇటు వచ్చే బళ్ళకూ, ఆ తర్వాత ఇటునుంచి అటు వెళ్లేబళ్లకూ, దారి వదులుతారు. ఇందుకోసం ప్రత్యేకంగా ఇద్దరు పోలీసులు బ్రిడ్జికి చెరి ఒక చివరా ఉండి, రాక పోకలకు సలహా ఇస్తారు. అద్దరినుండి బళ్లూ, సైకిళ్లూ, జనమూ వస్తూ వుండడంవల్ల మా బస్సు అక్కడ ఆగిపోవలసి వచ్చినది. ఆ వంతెన యిరుకుగా వుండడానికీ కారణం లేకపోలేదు. ఈ రోడ్డు వంతెనపైని రైల్వే లైను ఉన్నది. ఈ రెండు మార్గాలకూ అనుకూలం కావాలంటే వంతెన యీ విధంగానే ఉండాలి. రైల్వేలైను వెయ్యడానికి ప్రక్కనుండే యినుపగడ్డర్లూ, అడ్డుకమ్ములూ ఎంత బలం కలిగివుండాలో ఊహిస్తే తెలుస్తుంది. మేం చూస్తూ వుండగానే ఒక రైలుబండీ బలే వేగంతో వచ్చింది.

పది నిమిషాలకు యిద్దరినుంచి అద్దరికి వెళ్ళడానికి అనుమతి లభించింది. మా బస్సు నిదానంగా ప్రయాణంచేసి, అవతలి ఒడ్డు చేరుకున్నది. కొంచెం దూరం ప్రయాణంచేసి మేము "ఇత్-మద్-ఉద్-దౌలా"ను చూశాము. అది తాజమహాలుకు రమారమి రెండుమైళ్ళ దూరంలో యమునా

తిరాన్నే ఉన్నది. పూర్తిగా పాలరాతితో కట్టబడిన యీ భవనాన్ని నూర్జహాను తన తలిదండ్రుల సమాధులకు కట్టించినది. దీని నిర్మాణం క్రీ.శ. 1622 లో ప్రారంభమయి, పూర్తి కావడానికి ఆరేండ్లు పట్టిందట.

దీన్ని చూచినతర్వాత మేము ఆగ్రాలోని సుప్రసిద్ధమైన ఎర్రకోటకు వెళ్లాము. ఇది ప్రసిద్ధ చారిత్రక స్థలం. దీని ప్రహారిగోడ ఎత్తు 70 అడుగులు. ఎనిమిది బురుజులు. దీని చుట్టూఉన్న కందకం లోతైనదిగా వుంటుంది. చుట్టుకొలత రమారమి రెండు మైళ్లు. దీన్ని 16-వ శతాబ్దంలో అక్బరు పాదుషా కట్టించాడు. అయినా ఇది ఆతడు కట్టించిన రూపంలో లేదు. తర్వాత అతని కుమారుడు జహాంగీరు పాదుషా, మనుమడు షాజహాన్ పాదుషా—తమ తమ కాలాల్లో చాలా మార్పులు చేయించారు. ఇక్కడి మందిరాల్లో చాలాచోట్ల గోడలకూ, లోపలి గోపురాలకూ జహాంగీరు బంగారంతోను, రంగులతోను అలంకారాలు కూర్చాడు. షాజహాను ఎర్ర రాతి భవనాలను పూర్తిగా పాలరాతి భవనాలుగా మార్చి వేయించాడు.

అక్బరు కాలంనాటి చరిత్రనుబట్టి యీకోటలో అయిదు వందలకు పైగా భవనాలు వుండినట్లు తెలుస్తున్నది. కాని, తర్వాత చాలా మార్పులు రావడంవల్ల—ఆ చరిత్రలో వున్నట్లుగా ఇప్పటి కోటలోని భవనాలు కానరావు.

ఆగ్రాకోటలో చూడదగిన విశేషాలు చాలా ఉన్నవి. ఇక్కడ 900 చదరపు గజముల విస్తీర్ణంలో ఒకవైపు శీత కాలానికి అనుకూలమైన భవనమూ, వేరొకవైపు వేసవి కాలంలో నివాసయోగ్యమైన భవనమూ నిర్మించబడినవి.

ఒకే స్థలంలో విభిన్న కాలాలకు అనుకూలమైన భవనాలను నిర్మించడం అప్పటి వాస్తుశాస్త్రజ్ఞుల ప్రతిభకు గొప్ప నిదర్శనంగా కనబడుతుంది.

ఇక్కడి సుందర మందిరాల్లో దివాని—ఆమ్ అనే రాజ సభాభవనం ముఖ్యమైంది. దీనిని మొదట అక్బర్ చక్రవర్తి నిర్మించాడు. కాని షాజహాన్ చక్రవర్తి సింహాసనానికి వెనుక తట్టున ఉండే గోడను పాలరాతి గోడగా మార్చి, దానిపైని రంగులతో ఎన్నో అలంకారాలు కూర్చాడు. సింహాసనం చాలా ఎత్తయిన వేదికమీద ఉన్నది. దానికి ఆరు మెట్లు. మెట్లక్రింద ప్రధానమంత్రిపీఠం ఉన్నది. మిగిలిన మంత్రులుగా, పెద్దలూ కూర్చోడానికి పెద్ద హాలున్నది. ఈ హాల్లో ఎత్తుగా అలంకారశోభితాలయిన స్తంభాలు అరవై వున్నవి. ఒక స్తంభాన్ని వేరొకదానితో కలుపుతూ ఆకర్షణీయంగా ఆర్చిలున్నవి. ఇన్ని స్తంభాలున్నా, ప్రేక్షకులందరూ—ఎట్టి అడ్డూ లేకుండా చక్రవర్తిని దర్శించడానికి ఎంతో వీలుగా ఈ భవన నిర్మాణం జరిగింది. ఇది శిల్పిచాతుర్యాన్ని వ్యక్తపరుస్తూ వుంది. ఈ దివానీ—ఆమ్‌లో ప్రవేశించడానికి రెండు పెద్ద ద్వారాలున్నవి. ఒక ద్వారం రాజభవనాలవైపు ఉన్నది. వేరొకటి ప్రజాసమూహం లోనికి రావడానికి అనుకూలంగా ఉన్నది. రాజభవనాలవైపున ఉన్న ద్వారంనుంచి మంత్రులూ, మతగురువులూ, తక్కిన పెద్దలూ వచ్చేవారు. ద్వారం సింహాసనానికి నూరు గజాల దూరాన వున్నది. యీ సభాభవనం లోనే చక్రవర్తి ప్రజల మనవులను ఆలకించేవాడు. ప్రజా సామాన్యం వచ్చే ద్వారానికి అమర్ సింగ్ ద్వారమని పేరు. ఈ గేటుద్వారా లోపలికి వచ్చి రాజమందిరానికి వెళ్లుతూ

వుంటే రాతి స్నానపుతొట్టె ఒకటి కనిపిస్తుంది. దీన్ని జహాంగీరు స్నానపుతొట్టె అని అంటారు. ఒక పెద్ద బండ రాతిని తొలిచి దీనిని నిర్మించారు. దీని ఎత్తు ఆరడుగులు. తొట్టెలోపలికి వెళ్లడానికి అయిదు మెట్లుకూడా ఉన్నవి.

మొగల్ చక్రవర్తులు రహస్యాలోచనలు సలిపే దివానీ ఖాస్ అనే మందిరం చూడదగినది. ఇది పాలరాతితో ఆకర్షణీయాలయిన ఆర్చిలతో నిర్మితమయింది. చక్రవర్తులు కూర్చోవడానికి ఒక నల్లరాతి వేదిక, ఒక తెల్లరాతి వేదిక ఇక్కడ ఉన్నాయి. చక్రవర్తులు శీతకాలంలో కొలువు చెయ్యడానికి నల్లరాతి వేదిక నిర్మితమయింది. 1803–లో లార్డ్ లేక్ ఈ కోటను ముట్టడించినప్పుడు ఫిరంగి ప్రేల్చగా, దాని గుండు ఒక ఆర్చిలోనుంచి దూసుకుపోయింది. ఆ గుండు దెబ్బవలన కలిగిన రంధ్రం ఇప్పటికీ ఉన్నది.

దివానీఖాస్‌కు పది గజాల దూరంలో షీష్ మహాలు ఉన్నది. దీని గోడలలో రత్నాలూ, అద్దాలూ పొదుగబడి వుండినవి. కాని యిప్పుడు అవేవీ కానరావు. ఒక్క చిన్న అద్దంమాత్రం ఒక గోడమీద ఉన్నది. అందులోంచి చూస్తే రాజమహల్ యొక్క ప్రతికృతి కానవస్తుంది.

జహాంగీర్ మహల్ అనే భవనంలో హిందూ, జైన శిల్పకళ తొణికిసలాడుతూ వుంటుంది. ఆ సంప్రదాయాల ననుసరించి అక్బర్ పాదుషా దీన్ని నిర్మించాడట. ఆ చక్రవర్తికి గల సర్వమత సామరస్యం దీనివల్ల వ్యక్తమవుతూ ఉన్నది.

ఇంకా ఇక్కడ చూడవలసినవి చాలా ఉన్నా, మేము ఆరు గంటలకు తాజ్ మహలుకు వెళ్ళాలనే కుతూహలంతో

ఉన్నందున బస్సుకు బయలు దేరాము. అయిదు గంటలకు కాఫీ, ఫలాహారాలు తీసుకుని తాజ్‌మహాలు సమీపానికి రావలసిందని పాచకాధ్యక్షునికి మొదటే తెలియజేసి ఉన్నాము. ఇంకా కాఫీ లేకపోవడంచేత మాలో చాలామందికి తల దిమ్మెక్కిపోయింది. అందుచేతకూడా తొందరపడవలసి వచ్చినది.

మేము తాజ్‌మహాలుదగ్గరకు వెళ్లేసరికి అయిదు దాటింది. తాజ్‌మహాలు ప్రాంతపు ముఖద్వారానికి ఎదురుగా చెట్లక్రింద పచ్చికమీద మేం కూర్చుని, మాకోసం తెచ్చిన కాఫీ, ఫలాహారాలుతీసుకున్నాము. మాలాగేననే చాలామంది ఆ సమయంలో చెట్లక్రింద కూర్చుని ఫలాహారాలు చేశారు. అలా చేయడం ఎవరికీ ఎబ్బెట్టుగా తోచడం లేదు. తర్వాత మేము మా బస్సును ఆ సమీపంలోనే నిలిపి తాజ్‌మహాలుకు వెళ్లాము. తిరిగి వచ్చేసరికి ఎనిమిది గంటలు దాటుతుందని చెప్పాము. "ఎంతసేపన్నా కానీయండి. మీరు నిదానంగా చూచి రావచ్చు" అని అన్నాడు మా డ్రయివరు.

ఆ రోజు పౌర్ణమి. పౌర్ణమిరాత్రి తాజ్‌మహాలు చూడడానికి మనోహరంగా ఉంటుందని అందరూ అంటారు. అందువల్లనే దానికి అనుకూలంగా మా ప్రోగ్రాము వేసుకోవడం జరిగింది. నిండు వెన్నెలలో ఆ చలువరాతి భవనం కరిగిపోతూ ఉన్నట్లే కానవచ్చింది. అప్పుడు ఆ భవనాన్ని ఎంత చూచినా తనివి తీరలేదు.

తాజ్‌మహాలు ప్రపంచపు ఏడు అద్భుతాల్లోనూ ఒకటి. ఇది యమునానదీ తీరంలో ఉన్నది. దీనిని షాజహాను చక్రవర్తి తన భార్య ముంతాజ్ బేగము స్మృతిచిహ్నంగా నిర్మించాడు. అక్బర్ చక్రవర్తి మనుమడు షాజహాను క్రీ.శ.

1632 నుంచి 1637 వరకు ఆగ్రా రాజధానిలోనే వుండినాడు. అతడు ఆగ్రాకు అక్బరాబాద్ అనే పేరు పెట్టినాడట !

షాజహానుకు తన భార్య అయిన ముంతాజ్ బేగం పైని అపార ప్రేమ. ఆమె అవసానదశలో తన పేరు శాశ్వతంగా ఉండేటట్లు ఏదైనా స్మృతిచిహ్నంగా నిర్మించాలనీ, చక్రవర్తి మరొక యువతిని వివాహమాడరాదనీ తుది కోరికలను వెల్లడించిందట ! ఆమె కోరిక ప్రకారం షాజహాను వేరెవ్వరినీ వివాహమాడక, ముంతాజ్ బేగం పేరిట ఈ మహాభవనాన్ని నిర్మించాడు. దీని నిర్మాణం 1631 లో ప్రారంభమైంది. పూర్తిగా తయారవటానికి 17 సంవత్సరాలు పట్టిందట. ప్రతిదినమూ ఇరవై వేలమంది కూలీలు పనిచేసేవారు. నిర్మాణానికి ఆరు కోట్ల రూపాయలు ఖర్చయినాయట. ఈనాటి విలువప్రకారం లెక్కవేస్తే ఇంకా ఎన్ని కోట్లు అయివుండునో !

తాజ్ మహాలు పెద్దద్వారందగ్గర లిఖించబడిన వివరాలనుబట్టి నిర్మాణం 1631 లో ప్రారంభమై 1648 లో పూర్తి అయినట్లూ, దీనికి కావలసిన పాలరాతిని జయపూరునుంచి తెచ్చినట్లూ, దీనికి చుట్టూ గల ద్వారాలకూ, ప్రహరీగోడలకూ ఉపయోగించిన ఎర్రరాయి ఫతేపూరునుంచి తెప్పించబడినట్లూ తెలుస్తున్నది.

తాజ్ మహాలుదగ్గరకు వెళ్లాలంటే మొదటి ద్వారం నుంచి చాలాదూరం పోవలసి వున్నది. వెళ్లే మార్గానికి ఇరువైపులా అందమైన పూలచెట్లు ఉన్నవి. తాజ్ మహాలు వద్దకు వెళ్లుతూవుంటే మనస్సు కొక ప్రశాంతత ఏర్పడినట్లు తోచింది. ఏదో అపూర్వశక్తి ఆకర్షించుకొని పోయింది.

ఈ సుందర మందిరం సంపూర్ణంగా పాలరాతితోనే కట్టబడినది. ఇది ఎత్తయి, చాలా విశాలంగాఉన్న తిన్నెపయి ఉన్నది. తిన్నెకూడా పాలరాతి నిర్మాణమే అది 18 అడుగుల ఎత్తూ 313 చదరపుటడుగుల విస్తీర్ణమూ కలిగిఉన్నది. ఆ తిన్నెకు నాలుగు మూలలా మహోన్నతములై 130 అడుగుల ఎత్తు పాలరాతి స్తంభా లున్నవి. మధ్యను తాజ్‌మహా లున్నది. అసలు గోరీలను చూడడానికి మెట్ల వరుసనుంచి లోపలికి దిగాలి. అక్కడ పాలరాతితో నిర్మింపబడిన నూర్జహాను సమాధి, దాని ప్రక్కను షాజహాను సమాధి ఉన్నవి. మీదిభాగంలో నకలు సమాధు లున్నవి. మేము ఆ మందిరంచుట్టూ తిరిగి, ఆ శిల్పసంపదకు ముగ్ధులమయ్యాము. ఈ భవనాన్ని ఆనుకునే వెనుకతట్టున యమునానది వున్నది. యమునానదిలోని మందిర ప్రతిబింబం ఒక మనోహర దృశ్యం. మేము నాలుగువైపులా చెదిరి, ఎవరికి తోచిన చోట వారందరమూ కూర్చున్నాము. మహాలుకు తూర్పున నేను మరిద్దరు మిత్రులతో కూర్చున్నాను. అప్పటికి పున్నమ వెన్నెల మహాలుపైకి బాగా వ్యాపించింది. ఒక్కొక్క కోణం నుంచి మీదివైపు చూస్తే రంగురంగుల రత్నాలు పొదిగిన కాంతులు కన్నుల మిరుమిట్లు గొల్పుతూ ఉంటవి. ఆ సమయంలో ఆ మహాలు ఎత్తు ఎంత, నది మట్టంనుంచి వేదిక ఎత్తు ఎంత, స్తంభాల ఎత్తు ఎంత—అనే ఇలాంటి ఆలోచనలే కలగలేదు. అసలు తాజమహాలుకు ఎత్తునుబట్టి కాకుండా వైశిష్టాన్నిబట్టే గొప్ప ప్రతిష్ఠ కలిగింది.

రాత్రి ఎనిమిదిగంటలు దాటేవరకూ మేము అక్కడే ఉన్నాము. తర్వాత మెల్లగా అక్కడనుంచి బయలుదేరి

బస్సుకు ఒక్కొక్కరమూ చేరుకున్నాము. అందరూ చేరు కొనేటప్పటికి తొమ్మిది గంటలైంది. ఏమంటే—మాలో చాలామంది తాజమహలు చిత్రాలూ, నమూనా తాజమహల్ ఆట వస్తువులూ మొదలైనవి కొని తెచ్చుకున్నారు. తాజ మహల్ నమూనాలు రెండున్నర రూపాయలనుంచి ముప్ఫయి రూపాయలవరకూ ఉన్నవి. వాటిని అమ్మిన వర్తకులు అవన్నీ తెల్ల రాతితో తయారైనవే అని గట్టిగా చెప్పారు. కాని వాటిలో ఒకటీ మార్బిల్ స్టోన్‌తో తయారయినట్టు తోచలేదు. వాటిని ఇంటికి తేవడంలో చాలా జాగ్రత్త ఉండాలి. లేకపోతే తునాతునకలై పోతాయి. ఆ విధంగానే కొందరి వస్తువులు శిథిలాలయిపోయాయి.

భోజనాలు చేశాక చాలామంది స్టేషనులోని వెయి టింగు రూములలోనూ, ప్లాట్‌ఫారంమీదా పడకలు వేశారు. కొందరము బండీలోనే పరున్నాము. తెల్లవారుజామునే లేచి అవసరాలు తీర్చుకున్నాము. అప్పుడు మా గాయకబృందం కాఫీ ఫలాహారాలు వచ్చేవరకూ వాద్యాలతోకూడా గానం చేసి, మాకే కాకుండా అక్కడ వున్న యితరులకూ కూడా ఆనందాన్ని కలిగించారు. ప్లాట్‌ఫారంమీద వున్న జనంలో చాలామంది మా బండీదగ్గరే మూగి—గానకచేరీ ఆగేదాకా కదలక మెదలక నిలిచి వున్నారు.

ఏడుగంటలకు అల్పాహారాదులు ముగిశాయి. మరొక అరగంటకు మా కారు తగిలింపబడిన ప్యాసెంజరు బండీ కదిలింది. మళ్లీ మా గాయకబృందం గానం సాగించింది.

# మనస్సును కదల్చే మధురానగరి

ఆగ్రానుంచి మధుర ముప్ఫయిమూడు మైళ్ళ దూరంలో ఉన్నది. తొమ్మిదిగంటలకల్లా మేము మధురస్టేషను చేరాము. ఇది ఒక పెద్ద జంక్షను. ఆగ్రానుంచి మరొక మార్గంగా వచ్చిన చిన్న లైను ఇక్కడ కలుస్తుంది. ఇక్కడ నుంచి మరొక చిన్నలైను హాత్రాస్‌మీదుగా శాలెల్లికి వెళ్లుతుంది. అంతేకాక ఒక పెద్ద లైను ఇక్కడనుంచి భరత్‌పూరు మీదుగా కోటకు వెళ్లుతుంది. ఇక్కడి రైలుమార్గాలు చూస్తే దక్షిణప్రాంతంకంటే—అందులోనూ ఆంధ్రప్రాంతంలోకంటే—ఉత్తరప్రాంతం రైల్వే విషయంలో యెంతో అభివృద్ధిపొందిందనీ, ఇందులో నాలుగో వంతైనా ఆదరం చూపిస్తే ఆంధ్రదేశం యెంతో అభివృద్ధి పొంది ఉండునని తోచకమానదు.

ఆగ్రాలో ఉన్నట్లుగా మధురలో బస్సుల సౌకర్యం లేదు. గవర్నమెంటు ట్రాన్స్‌పోర్టు పద్ధతి ఉన్నట్లుగాని, ఒకవేళ ఉన్నా, ఇతరుల సౌకర్యాలు ఆలోచించేటట్లు గాని కానరాదు. ప్రయివేటు బస్‌సర్వీసువారు దయ తలిస్తే తప్ప వేరే మార్గం కానరాదు. అందువల్ల మేము బస్సులు ఏర్పాటయేవరకూ గంటన్నర స్టేషనులోనే ఉండిపోవలసి వచ్చింది. పదిన్నరకు మాకోసం ఏర్పాటు చేసుకున్న రెండు బస్సులు వచ్చాయి. మొదట యమునలో స్నానంచేసి, తర్వాత బృందావనం వెళ్ళిరావడానికి వాటిని ఏర్పాటు చేసుకోవడమయింది.

భాగవత పురాణాన్ని బట్టి మధుర ఉగ్రసేనుని రాజధాని అనీ, కొన్ని వేల ఏండ్ల కిందట ఇది కట్టబడినదనీ తెలియవస్తున్నది. పురాణాల సంగతి అలా వుంచినా, ఈ మధుర మిక్కిలి ప్రాచీనమైన పట్టణమని చెప్పవలసి ఉన్నది. ఇప్పుడు మధుర ఉన్న ప్రాంతంలో క్రీ. పూ. 600 లలో కూడా ఒక పట్టణం వున్నట్లు చరిత్రవల్ల తెలుస్తున్నది. క్రీ.శ. 1017 లో గజనీ మహమ్మదు ఈ నగరాన్ని ధ్వంసంచేసి, ఇక్కడి బంగారు, వెండి విగ్రహాలు అనేకం దోచుకుపోయాడు. తర్వాత హిందూ రాజులు కృష్ణుడు జన్మించినచోట దేవాలయాన్ని నిర్మింపగా మొగలుచక్రవర్తులలో ఒకడైన ఔరంగజేబు ఆ దేవాలయాన్ని నేలమట్టం చేయించి, ఆ దేవాలయపు రాళ్లతోనే ఒక మసీదు కట్టించాడు. కృష్ణజన్మస్థలంగా విశ్వసింపబడుతున్న పవిత్రస్థలం యీ మసీదును ఆనుకొనే వున్నది. ఇప్పుడిక్కడ ఒక చిన్నమందిరం, దానిలో శ్రీకృష్ణుని పటం మాత్రం ఉండి, దయనీయ స్థితిని వెల్లడిస్తూ ఉన్నవి. ఈ నగరంలో, త్రవ్వకాలలో లభించిన కళాఖండాలు ఒక మ్యూజియంలో భద్రపరుపబడి ఉన్నవి.

మేము బస్సులలో ఎక్కి తిన్నగా యమునాతీరానికి వెళ్ళాము. అక్కడ యమునలో స్నానం చేసుకున్నాము. నది పూర్తిగా ప్రవహిస్తూ ఉన్నందున నీరు బురదగానే ఉన్నది. నీటిలో అడుగు పెట్టగానే కాళ్లకు పెద్ద పెద్ద తాబేళ్లు తగిలినవి. అవి ఏమి చేస్తాయో అని కొందరు భయపడ్డారు. కాని, సరయూనదిలో ఇక్కడికంటె పెద్దతాబేళ్లు వుండడం ఎరిగిన నాకు ఆశ్చర్యం కలగలేదు; భయమూ వేయలేదు.

స్నానానంతరం మేము బృందావనానికి వెళ్లాము.

మధురకంటె బృందావనమే చూడదగినదనీ, అక్కడే చక్కని దేవాలయాలున్నవనీ, శ్రీకృష్ణుడు విహరించిన స్థలాలు బృందావన భూములే అనీ అందరూ చెబుతారు. అందువల్ల మేము ముందుగా అక్కడికే వెళదామనుకున్నాం.

బృందావనం మధురకు అయిదు మైళ్ళ దూరంలో ఉన్నది. శ్రీ కృష్ణుడు విహరించిన స్థలం అదే అని చెబుతారే కాని, అక్కడివారు చూపే గురుతులనుబట్టి—అవి ప్రాచీనాలని అనుకోవడానికి అవకాశం తక్కువ. స్థానికులు కొందరు యాత్రికులకు "ఇది అసలు స్థలం; వారు చూపినది కాదు. మా వెంట రండి" అని ప్రాధేయపడతారు. మరొక పార్టీవారు మరొక స్థలం చూపుతారు. అందువల్ల కొత్తవారు ఏదీ నమ్మలేని స్థితికి వస్తారు. బృందావనంలో బస్సులు దిగగానే చాలమంది మమ్మల్ని చుట్టుకొన్నారు. మాకు గైడు సహాయం అక్కరలేదనీ, మేము యాత్రికులం కామనీ, మాకు తోచినవి చూచి వెళతామనీ చెప్పి చాలామందినుంచి తప్పించుకున్నాం. కాని, ఒక్కడుమాత్రం మా వెంట వస్తూ, మేము సందులు తిరిగేటప్పుడు "ఆ సందు కాదు, ఈ సందులోంచి వెళ్లా"లని చెప్పుతూ ముందుకు వచ్చి నడవసాగినాడు. విధిలేక మేము అతనిని వెంబడింపవలసి వచ్చింది. "మీరు కొత్తవారు; ఇక్కడివారు మోసగాళ్లు; మీకు శ్రీ కృష్ణ దేవుని మూలస్థానాన్ని చూపిస్తాను; రండి" అంటూ ఒక సందులో నుంచి—ఒక మేడలోని ఇరుకుమెట్లలోంచి కొంచెం ఎత్తుకు తీసుకుని వెళ్ళి ఒక కృష్ణవిగ్రహం ఉన్నస్థలాన్ని చూపాడు. ఎవరో గృహస్థులు తమ యింట్లో పూజకోసం ఏర్పాటు చేసుకున్నట్లు కానవచ్చింది ఆ స్థలం! "ఇదే మూల స్థాన"మని

అతడు గట్టిగా చెప్పాడు. కాని మాకు నమ్మకం లేకపోయింది. తీరా వచ్చాము కాబట్టి, వచ్చినందుకు కొంత దక్షిణ సమర్పించి, వెనక్కు వచ్చాము.

మా బస్సులు నిలిచినచోటనే ఒక పెద్ద దేవాలయం ఉన్నది. అది దాక్షిణాత్య శిల్పంతో అలరారుతూ ఉన్నది. "ఆ దేవాలయం ఏమిటి? దాని వివరాలు చెప్పనేలేదే!" అని మేమతనిని అడిగాము. అడిగితే ఆ గైడు "ఇది దరిమిలాను కట్టింది. ప్రాచీనం కాదు. ఇది శ్రీరంగ దేవాలయం. దాక్షిణాత్యులది" అని చెప్పి వూరుకున్నాడు. మేము ఆ దేవాలయ ద్వారంవద్దకు వెళ్లాము. కాని అప్పటికే పన్నెండుగంటలు కావడంవల్ల గుడి తలుపులు మూసివేసి వున్నాయి. తిరిగీ నాలుగ్గంటలకుగాని తెరవరట!

ఉత్తరదేశంలో దాక్షిణాత్య సంప్రదాయంప్రకారం కట్టబడి, దాక్షిణాత్య పద్ధతిలోనే పూజాపురస్కారాలు జరిగే దేవాలయం ఈ శ్రీరంగదేవాలయం ఒక్కటే! ఇక్కడి పూజారులూ, స్థానాచార్యులూ కంచినుంచి వచ్చినవారు. ఇంత దూరమూ వచ్చి యీ స్వామిదర్శనం చేసుకోకుండా వెళ్ళుతున్నామే—అని మనస్సులో కొంత కించగానే ఉండింది.

మేమ మా వెంటనే బయలుదేరి గీతామందిరానికి వెళ్లాము. అది బృందావనంనుంచి మధురకు వెళ్లే మార్గంలోనే ఒక మైలుదూరంలో ఉన్నది. అది కోటీశ్వరుడైన బిర్లా మహాశయునిచే కట్టించబడిన మందిరమట! అతడు ఈ విధంగా ఢిల్లీ మున్నగు చాలాచోట్ల మందిరాలను కట్టించాడు. ఇక్కడ భగవద్గీతలోని శ్లోకాలకు అనుకూలంగా త్రివర్ణ చిత్రాలూ, వాని క్రింద శ్లోకాలూ కుడ్యాలమీద చిత్రించబడి ఉన్నవి.

ఈ మందిరం చూడడానికి మనోహరంగా ఉంటుంది. దీనిని చూచినవారికి సామాన్యంగా భగవద్గీతమీదా, హిందూ ధర్మంమీదా ఆదరం కలుగుతుంది.

గీతామందిరాన్ని చూచిన తర్వాత మేము స్టేషనుకు వెళ్లి భోజనంచేశాము. భోజనానంతరం కొందరు విశ్రాంతి తీసుకున్నారు. మరికొందరు మథురానగరి చూడడానికి వెళ్లారు. బృందావనానికి తిరిగి వెళ్ళి దేవదర్శనం చేసుకోవాలనీ, యమునాతీరంలో కాళీయమర్దనం జరిగిన స్థలము మున్నగునవి చూడాలనీ ఇద్దరు ముగ్గురు మిత్రులు సంకల్పించుకొని ఒక టాంగా మాట్లాడుకున్నారు. వారి కోరికమీద నేనూ వారితో బయలుదేరాను.

సరిగా రెండున్నరకు మేము బయలుదేరినాము. టాంగావాలా ఆయా చోట్ల విశేషాలు తెలిపేవాడు. బండి కొంతదూరం నడిచాక ఒక అడ్డురోడ్డు వచ్చింది. ఆ మార్గంగా రమారమి నాలుగు మైళ్ళు వెళ్లితే గోవర్ధనగిరి వస్తుందని అతడు అన్నాడు. మాకు వ్యవధి ఉంటే అక్కడికి వెళ్ళేవారమే! కాని, ఆరు గంటలకు తప్పకుండా టూరిస్టుకారుకు వచ్చి తీరుతామని లీడరుతో చెప్పినందున—త్వరత్వరగా ముఖ్యమైనవి చూడదలచి తిన్నగా బృందావనానికే వెళ్ళినాము. మా టాంగా ఆగగానే ఒక తీర్థ పురోహితుడు మా వెంటపడి అసలు దేవాలయాన్ని చూపిస్తానన్నాడు. అక్కరలేదని మేము చెప్పుతూ—కాళీయుడుండిన మడుగునకు దారి అడిగి తెలుసుకుని వెళ్లాము. అది—ఉదయం మేము చూచిన శ్రీ కృష్ణుని దేవాలయానికి దగ్గరలోనే ఉన్నది. మేము మెట్లెక్కి, ఎత్తుగా ఉన్న స్థలానికి వెళ్లాము. అక్కడనుంచి

చూస్తే చాలా కిందుగా—పాచిపట్టి, కొంచెం నీటితో అస హ్యంగా ఉన్న చిన్నమడుగు ఒకటి కానవచ్చింది. అదే కాళీ యుని మడుగని అక్కడివా రన్నారు. కాని, యథార్థంగా అదే యిదని నమ్మకం కలగడం కష్టం.

అప్పటికి నాలుగుగంటలైంది. శ్రీరంగదేవాలయం తలుపులు తెరిచి వుంటారు గనుక అక్కడికి వెళ్లినాము. ఆ దేవాలయం అతి విశాలమైంది. దేవాలయం లోభాగంలో ప్రాకారానికి ఆనుకుని ఎన్నో గృహాలు ఉన్నవి. దేవాల యంతో సంబంధంకలవారు కాపురం ఉండటానికీ, పై స్థలాల నుంచి వచ్చేవారి బసలకూ అవి ఉపయోగపడుతున్నవి. మేము దేవాలయంలోకి వెళ్లేసరికే కొందరు యాత్రికులు గర్భగుడిలోకి వెళుతున్నారు. వారిలో కొందరు ఆంధ్రు లూ ఉన్నారు. అర్చకులు చెప్పేది వారికి బోధపడకపోతే మేము తెలుగులో చెప్పాము. మేము అరవంలో మాట్లాడగా, అర్చకులు సంతోషించి, తమ నివాసం కంచి అని చెప్పారు. మేము కోరగా, అతి శ్రద్ధతో పూజ జరిపారు.

అక్కడి. కృష్ణవిగ్రహం కళలుట్టిపడుతూవున్నది. అది దాక్షిణాత్య సంప్రదాయాన్ని కాక, ఉత్తరాది పద్ధతిలో నిర్మితమైనట్లు తోస్తుంది. మేము దేవదర్శనం చేసుకుని తీర్థ ప్రసాదాలు స్వీకరించి టాంగా ఎక్కి మధురమార్గం పట్టాము. మేము మధుర సమీపానికి వచ్చేసరికి అయిదు గంటలయింది. ఇంకా గంటసేపు మేం తిరగవచ్చును. "శ్రీ కృష్ణుడు జన్మిం చిన స్థలం ఎక్కడో చూపగలవా?" అని టాంగావాలాను అడగ్గా అతడు "దానికి మూడు ఫర్లాంగుల దూరం చిన్న రోడ్డుమీంచి వెళ్ళాలి. కావాలంటే తీసుకువెళతా"నన్నాడు.

అందుకోసం మరొక అర్ధరూపాయ స్నానికి త్రవ్వడానికి నిర్ణయించి—అక్కడికి వెళ్లాము. "దేవకీ వసుదేవుల కారాగారం" అని ఒక ఇనుప కటకటాలున్న చిన్న గదిని, అక్కడి వారు చూపి దక్షిణ స్వీకరించారు. గది చాలం పురాతనానిచే కావచ్చు కాని, ఆ కారాగారం ఇంతవరకూ ఇలా నిలిచివున్న దంటే ఎవరు నమ్ముతారు? నలుగురితోపాటు "మేమూ ఆ స్థలం చూచాము" అని చెప్పుకొని తృప్తిపడడానికే దాన్ని చూడటం.

ఆరుకు పదినిమిషా లున్నదనగా మేము మా టూరిస్టు కారు చేరుకున్నాము. పట్నంలోకి వెళ్లినవారిలో కొందరింకా రానేలేదు. మేము ప్రయాణంచేయవలసిన బండి అయిదు నిమిషాలు తక్కువ ఏడుకు బయలు దేరుతుందనే ధైర్యంతో వారు కొంత ఆలస్యంచేసి వుండవచ్చును. మేము రాగానే మా కేటరింగు శాఖవారు కాఫీ యిచ్చారు. ఫలాహారం మాత్రం అయిపోయిందన్నారు. "ఇచ్చినా, ఈ అసమయంలో మాకు అక్కరేలేదు" అని మే మన్నాము.

వేరే స్థలాలకు వెళ్లకుండా బండిలోనే వుండి విశ్రాంతి తీసుకుంటున్న కొందరు మమ్మల్ని బృందావనంలో మేము చూచిన విశేషాలనుగురించి ప్రశ్నించగా, వారికి సమాధానాలు చెప్తూ ఉన్నాము. ఇంతలో పట్నంలోకి వెళ్లినవారూ వచ్చారు. మేము బృందావనాన్ని గురించీ, శ్రీకృష్ణుని జన్మస్థలాన్నిగూర్చీ చెప్పినతర్వాత పట్నంనుంచి వచ్చినవారిలో ఒకరు "మీకంటే మేమే మంచి దృశ్యాలు చూశామన్న మాట. మీరు చూచినవాటిపైని మీకు నమ్మకం లేక పోయింది కదా! మేము చూచినవి నమ్మదగినవీ, యథార్థాం

లున్నా. తక్కినవాటి సంగతికేమి కాని, మ్యూజియం తప్పక చూడవలసింది'' అన్నారు. మేము అడగ్గా అతడు ఆ మ్యూజియం గురించి యిలా చెప్పాడు :

''ఇది పురాతనమైన నగరమని మీకు తెలుసును కదా! అందువల్ల ప్రాచీన స్థలాల్లో యిక్కడ త్రవ్వకాలు జరిగాయి. అప్పుడు ప్రాచీనకాలంలోని శిలావిగ్రహాలూ, శిల్పాలూ, జేగురు మట్టి పాత్రలూ కంచువస్తువులూ మొదలైనవి బయలుపడ్డాయి. ఈ పురావస్తువులను భద్రపరచడానికి 1874 లోనే ఒక వస్తుప్రదర్శనశాల యిక్కడ స్థాపించబడిందట. ఇందులో క్రీస్తుకు పూర్వం నాలుగువందలనుంచీ, క్రీస్తు తర్వాత పన్నెండువందలదాకా—ఈ మధ్యకాలంలో వుండిన వివిధ కళాఖండాలూ ఉన్నవి. ఇవన్నీ మధురజిల్లాలో తయారైనవే! మధురకు చుట్టుప్రక్కల వున్న దిబ్బలను త్రవ్వగా ఇవి లభించినవట! ఇక్కడి కళాఖండాలను పరిశీలించి చూస్తే మధుర పూర్వకాలంలో బౌద్ధస్తూపాలూ, జైన మందిరాలూ, విహారాలూ, హిందూ దేవాలయాలూ మున్నగు వాటికి నిలయమనీ, అందువల్ల భారతదేశంలోని వివిధ నాగరికతలకూ కేంద్రమై ఉండిందనీ వూహించాలి.''

అని ఈ విధంగా అతడు చెప్తూ వుంటే మరొకరు అడ్డువచ్చి ''మనం కొన్ని వీధులను చూచి వున్నాము కదా! ఇప్పటికీ ఇది ఎన్నో శతాబ్దాలు వెనక వున్నట్లు తోస్తూనే వున్నది. మొత్తంమీద ఈ వూరే ఒక మ్యూజియంగా ఉన్నది'' అన్నాడు.

''అవును. అంతమాత్రాన మనం పట్టణాలను నిరసించకూడదు. నాటినుంచీ నేటిదాకా మధురకు ప్రాముఖ్యం

వుంటూనే ఉన్నది. పూర్వం యిది శూరసేన దేశానికి ముఖ్య నగరంగా వుండేది. దీని ఉత్తర సరిహద్దు కురురాజ్యమట! ఇక్కడి ప్రజలు ఉదారస్వభావానికి పేరు పడ్డారు. చైనా యాత్రికులు ఫాహియాన్, యువాన్ చ్వాంగుల కాలాలలో ఈనగరం మతానికి ఒక కేంద్రంగా వుండినట్లు తెలుస్తున్నది. విక్రమగుప్తుని కాలంలో ఇక్కడ శ్రీకృష్ణునికి గొప్ప దేవాలయం కట్టారట!'' అని రెండో ఆయన ఏకరువుపెట్టడం ప్రారంభించాడు.

''నీది వూరుకునే స్వభావం కాదు. తీగ కదిపేవు, డొంక అంతా కదిలింది. ఆ చరిత్రబోధకుని ఎదట నీవు నిలవ గలవా?'' అని మరొకరన్నారు.

ఏమయితేనేం? ఆగ్రాలాగ మధుర ఆకర్షణీయంగా మాత్రం లేదు. ఆ స్టేషనులో జరిగినట్లు ఇక్కడ సదుపాయాలూ జరగలేదు. ఏమడిగినా స్టేషనుమాష్టరు అధికార ధోరణిలోనే మాటలాడేవాడు. కాని, సుదీర్ఘ ప్రయాణం చేసే ప్రయాణికులనన్నా ఒక కంట చూద్దామని అనుకోలేదు. మా టూరిస్టుకారును ఒక సైడింగు చివర ఉంచివేశాడు. సమీపంలో నీటి సౌకర్యం లేదు. ఒక బ్యాచి భోజనం చేస్తున్నప్పుడు రెండవ బ్యాచివారు ఎండలో బయట నిలవవలసి వచ్చింది. ఇట్టి రైల్వే ఉద్యోగులే ప్రధాన స్థలాల్లో ఉంటే, ఒకసారి ప్రయాణం చేసినవారికి మరోసారి వెళ్లబుద్ధిపుట్టదు.

సాయంకాలం 6-55 గంటలకు మా కారు తగిలించబడిన ప్యాసింజరుబండి ప్రయాణం మొదలుపెట్టింది. మధుర నుంచి బయలుదేరడమే ఒక గొప్ప విశ్రాంతిగా మాకు తోచింది.

# దీటు లేని ఢిల్లీ నగరం

మధురనుంచి మేము న్యూఢిల్లీకి వెళ్ళవలసివున్నది. అది మధురకు ఎనభై ఎనిమిది మైళ్ళు. ఇంత దూరం సాధారణంగా ప్యాసెంజరుబండి వెళ్ళడానికి ఆరుగంటలు పడుతుంది. కాని, మా బండి అయిదు గంటల ప్రయాణంలోనే న్యూఢిల్లీ చేరుకుంది. కారణ మేమిటంటే వార్ధానుంచి నాగపూరునకు ఉన్నట్లుగా—మధురనుంచి ఢిల్లీ వరకూ జంట రైలుమార్గాలు వున్నాయి. అందువల్ల ఎదురుగా వచ్చే బండ్ల ఆటంకం ఏమీ లేకపోయింది.

మా లీడరుగారు ముందుగానే మాతో—"మన బండి రాత్రి పన్నెండు గంటలకు న్యూఢిల్లీ చేరుతుంది. తెల్లవారే వరకూ మనం బండిలో వుండవలసిందే. ఉదయం అయేసరికి మనకోసం బస్సులతో మనుష్యులు వస్తారు. అప్పటికి మీరందరూ సిద్ధంగా వుండాలి. మనం ఢిల్లీలో మూడు రోజులుంటాము. మనకోసం వేరే బసకూడా ఏర్పాటు చెయ్యబడింది. అందువల్ల అందరూ—మూడు రోజులకు సరిపడిన బట్టలూ; అవీ సిద్ధంగా ఉంచుకోండి. మూడవ దినం రాత్రికి గాని మనం తిరిగి మన కారుకు రాలేము" అని అన్నాడు.

అత డిలాం చెప్పడంవల్ల తెల్లవారుజామున సావకాశంగా చిన్న చేతిసంచీలో కావలసినవి సర్దుకొని పోవచ్చునని ధైర్యంతో అందరమూ ఉన్నాం. కొంతవరకూ నిద్ర పట్టింది. ఎప్పుడు వచ్చామో తెలియకుండాగాని ఢిల్లీకి వచ్చేశాము. టైము

చూస్తే పన్నెండయింది.

బండి ఆగిన అయిదు నిమిషాల్లో లీడరు వచ్చి "మన కోసం యీ బండికే ఒకరు వచ్చారు—రెండు బస్సులతో. మీరు వెంటనే బయలుదేరాలి. వేగంగా కావలసినవన్నీ పట్టుకోండి"—అని అన్నాడు. ఆ తొందరపాటులో కావలసినవి మరిచిపోవడమూ, అక్కరలేనివి తీసుకొని పోవడమూ కూడా జరిగింది. ముఖ్యంగా అందరమూ మురికిగుడ్డలు మూటకట్టుకున్నాము, లాండ్రీలలో వెయ్యాలనుకని. ఆ అర్ధరాత్రప్పుడు మాకోసం వచ్చిన ఆ తగు మనిషి రెండు ట్రాలీలు తెప్పించి, మా సామానులు వాటికి ఎక్కించి, మమ్మల్ని స్టేషను పక్కనున్న బస్సులదగ్గరకు తీసుకువెళ్ళాడు. మేము మా మా వస్తువులతో వాటిలో కూచున్నాము. ఆ బస్సులు మమ్మల్ని నిశ్శబ్దంగా ఉన్న ఆ మహాపట్నంలో మే మెరుగని గమ్యస్థానానికి తీసుకుపోతూ ఉండినవి.

కొన్ని మైళ్లు నడిచాక మా బస్సులు ఒక పెద్ద భవనం దగ్గర ఆగాయి. ఆ భవనం పార్లమెంటు సభ్యులకు, వారి అతిథులకూ ప్రత్యేకింపబడినదట. మా బస ఏర్పాటు అక్కడే! ప్రత్యేకించి మాకొక గృహం. అందులో విశాలమైన గదులు మూడూ, వంటగదీ, స్నానాలగదీ వున్నవి. ముందు విశాలమైన వరాండా ఉన్నది. అందరమూ బస చెయ్యడానికి అది సరిపోతుంది. కాఫీ, ఫలాహారాలకు భోజనానికీ పార్లమెంటు మెంబర్ల కాంటీను అనుకూలంగా వుంటుంది. అక్కడ దక్షిణదేశపు కాఫీ ఫలాహారాలూ, భోజనమూ లభిస్తాయి. తక్కిన చోట్లకంటె ఛార్జి కొంచెం తక్కువేనట! ఇవన్నీ ఆలోచించే మాకు డిల్లీలో ఏర్పాట్లు చెయ్యడానికి ఎంతో శ్రద్ధా, ఆసక్తి

చూపిన శ్రీ రామయ్యగారు తమ పలుకుబడిని ఉపయోగించి అక్కడ ఏర్పాటుచేశారు.

శ్రీ రామయ్యగారు కేంద్రప్రభుత్వంలో వ్యవసాయ శాఖకు డిప్యూటీ సెక్రటరీ; ఉదారులు; విద్యాభిమానులు. వారి పర్యవేక్షణక్రిందనే అక్కడ దక్షిణ ఇండియా హయ్యర్ సెకండరీ స్కూలూ, దాని శాఖావిద్యాలయమూ చక్కగా నడుస్తున్నవి. శ్రీరామయ్యగారి కోరికపైనే ఆ బడిలోని ఉపాధ్యాయులు అనేకవిధాల సాయంచేశారు. ముఖ్యంగా శ్రీ యజ్ఞనారాయణ అయ్యరుగారు మేమక్కడ ఉన్నమూడురోజులూ మా వెంటనే వుండి బహువిధాల సాయపడ్డారు. అర్ధరాత్రి సమయంలో స్టేషనుకు వచ్చి మమ్మల్ని వెంటనే బసకు చేర్చింది శ్రీ యజ్ఞనారాయణయ్యరుగారే!

మేము పడకలు పరుచుకుని కన్నులు మూసుకునేసరికి ఒంటిగంటన్నర దాటింది.

ఉదయానికల్లా అవసరాలు ముగించుకుని సిద్ధంగా వున్నాము. ఆరున్నరకే కాఫీ, ఫలాహారాలు తయారుగా వున్నాయని వార్త వచ్చింది. కాబట్టి మా లాడ్జీకి పక్కనే వున్న కాంటీన్‌కు పోయి ఫలాహారాదులు ముగించుకున్నాము. ఇంతలో ఒక పెద్దబస్సుతో శ్రీ యజ్ఞనారాయణయ్యరుగారు వచ్చారు.

మేము మొట్టమొదట పాతఢిల్లీలోని కుతుబ్ మీనారు చూడడానికి వెళ్ళాము. బహుశా పదెనిమిది మైళ్ల దూరం వెళ్లిఉంటాము. మేము బస చేసిన చోటు న్యూఢిల్లీలో ఒక కొన అన్నమాట. ఆ భాగానికి నార్త్ అవెన్యూ అంటారు. కాబట్టి మేము కొత్తఢిల్లీ మధ్యనుండే ప్రయాణం చెయ్య

వలసి వచ్చింది. మార్గంలో పార్లమెంటుభవనం, రాష్ట్రపతి భవనం, ప్రధానామాత్యుని భవనం, సెక్రటేరియేటు భవనాలూ, విమానాశ్రయం మొదలైనవాటిని దాటుకునే వెళ్లాం.

ఢిల్లీ రోడ్లలోని విశేషమేమంటే— మామూలు రోడ్లే కాక, సైకిళ్ల రాకపోకలకు—రోడ్డుకు కుడి, ఎడమభాగాలలో ప్రత్యేకంగా మార్గాలుంటాయి. దీన్నిబట్టి అక్కడ సైకిళ్ళు అపరిమితమని తెలుసుకోవచ్చును. ఢిల్లీ భారతదేశానికి ముఖ్యనగరం కావడంవల్లదిప్రభుత్వకార్యాలయాలన్నీ అక్కడే వున్నవి. కాబట్టి అందులో పనిచేసే మధ్యతరగతి ఉద్యోగస్థులు అసంఖ్యంగా వుంటారు. వారు తమ బసలనుంచి కార్యాలయాలకు వెళ్ళాలంటే మైళ్ళ దూరం పోవాలి. తమ పిల్లలను చదువుకోసం మైళ్ళకొద్దీ దూరంలో ఉన్న బడులకు పంపాలి. అందుకోసమే బస్సులో సాధారణంగా ప్రయాణం చేస్తే—సమయానికి బస్సు అందకపోవడమూ, అధిక వ్యయమున్నూ. వెయ్యి రూపాయలకుపైగా జీతం తెచ్చుకుంటున్న వారు కాని కారు భరించలేరు. అందువల్ల కొంత పెద్ద తరగతికి చెందినవారు మోటారుసైకిళ్లు కొంటారు. ఉద్యోగస్థులు ఆఫీసుకు పోయేముందు తమ పిల్లలనుకూడా సైకిలుపై కూర్చుండబెట్టుకు వెళ్ళి, వారిని బడిదగ్గర విడిచిపెట్టి తాము, ఆఫీసుకు వెళతారు. సాయంకాలం ఆలాగే బడికి వచ్చి పిల్లలను తిరిగీ తీసికొని యింటికి వస్తారు. కొన్ని బడులకు స్కూలు బస్సులు ప్రత్యేకంగా ఉన్నవి. ఆ సౌకర్యం లేనిచోట్ల పిల్లలకు సైకిలుమీద వెళ్లడమే సదుపాయం. ఈ సౌకర్యమే లేకపోతే ఢిల్లీలో ఉన్నవారు అంతులేని శ్రమ పడవలసివచ్చేది.

సైకిలు తొక్కే విషయంలో మన ప్రాంతంలోకంటె

చాలా నిబంధనలు సడలింపబడివున్నాయి. ఇద్దరు ఒక సైకిలు మీద ప్రయాణం చెయ్యడం అక్కడ తప్పుకాదు. ఒక సైకిలు మీద ముగ్గురుకూడా ప్రయాణంచెయ్యడం చాలచోట్ల కాన వచ్చింది. ఈ రీతిగా సైకిలుకు లైటు లేకున్నా తప్పుగా లెక్కకు రాదు.

మేము ఎనిమిది గంటలకు కుతుబ్ మీనారుకు వెళ్లాము. అది ప్రాచీనమైన నిర్మాణం. 13-వ శతాబ్దంలోని రెండవ భాగంలో కుతుబుద్దీను నిర్మాణం ప్రారంభించాడు. ఎత్తు 238 అడుగులు. అయిదు అంతస్తులు. స్తంభం అడుగునుంచి పైకి వెళ్ళడానికి 379 మెట్లున్నవి. మీదికి ఎక్కేవారికి గాలి, వెలుతురు రావ డానికి అక్కడక్కడ గూళ్ళవంటి కిటికీల ఏర్పాటున్నది. ఇక మీద లోపల వెలుతురుకోసం విద్యుద్దీపాల ఏర్పాటు జరుగు తుందని వినికిడి. ఆ స్తంభాన్ని చూస్తేనే చాలామందికి ఆశ్చర్యంతోపాటు భయమూ కలుగుతుంది. దాన్ని ఆరో హించడానికి కొంత ధైర్యమూ, తెగింపూ ఉండాలి. మాలో నలుగు రైదుగురు మాత్రం మీదికి ఎక్కక సమీపంలో ఉన్న పచ్చికబయలులో చెట్లనీడను విశ్రాంతి తీసుకున్నారు. స్త్రీలతోసహా కొందరంమాత్రం మీదికి ఎక్కాము. మీదికి ఎక్కేటప్పుడు కొంత ఆయాసపడడం సహజమే! కిందికి దిగేటప్పుడుమాత్రం అంత శ్రమ అనిపించలేదు. అయితే— దిగేటప్పుడు తొందరపడితే కాళ్లు బెణకడమూ, నొప్పు లెత్తడమూ తప్పదు.

మీదికి ఎక్కిచూస్తే ఢిల్లీ పట్టణం యావత్తూ, పరిసరా లతో కూడా కనబడుతుంది. కిందికి చూస్తే కన్నులు తిరిగి పోతాయి. భయంచేవాళ్ళు కిందనే వుండిపోయారు కనుక

మేము శీఘ్రంగానే క్రిందికి రాగలిగినాము.

కుతుబ్ మీనారుకు సమీపంలోనే ఒక ఇనుప స్తంభం ఉన్నది. దాని ఎత్తు రమారమి ముప్పయి అడుగులు వుంటుంది. అంత పెద్ద స్తంభాన్ని—పూర్తిగా ఇనుముతో తయారైన దానిని ఆ కాలంలో ఆ విధంగా నిలపడం మానవశక్తికి అతీతంగా తోచకమానదు. అదీ 13–వ శతాబ్దపు నిర్మాణమే!

అక్కడినుండి బయలుదేరి మేము తిన్నగా హుమా యూను సమాధి చేయబడిన గోరీని చూడటానికి వెళ్లాము. అది ప్రాచీనకాలపు మొగలు చిత్రకళకు నిదర్శనమైన పెద్ద భవనం. క్రీ.శ. 1565 లో ఆతని భార్యఅయిన హామీదా బానూ బీగంచే నిర్మింపబడింది. దీని శిల్పకళ అందరినీ ముగ్ధులను చేస్తుంది. అయినా—ఇది తాజమహాలుకు తర్వాతే.

అరగంట తర్వాత మేము సఫ్దర్‌జంగు సమాధికి వెళ్లినాము. అది ఢిల్లీలోని సుందర దృశ్యాలలో పేరు పడినది. ఈ భవనానికి ముందు విశాలమై మనోహరమైన ఉద్యానవనం కానవస్తుంది. అది యీ భవనానికి ఎంతో రమణీయతను కలిగిస్తూ ఉన్నది. ఇది 1753 లో అతని కుమారుడైన షాజఉద్దౌలాచేత నిర్మించబడినది. మొగలు సామ్రాట్టుల కడపటి శిల్పకళ కిది నిదర్శనం. ఆ తర్వాత యీ శిల్పకళ క్షీణించిపోయింది.

ఈ సమాధులను చూచిన తర్వాత మేము లాల్ ఖిల్లా లేక–రెడ్ ఫోర్టుకు బయలుదేరినాము. దారిలో నేషనల్ స్టేడియము చూచాము. అది హాకీఆటకు అనుకూలమైనది. ఆకర్షణీయంగానే ఉన్నది కాని చాలా చిన్నది.

మేము మార్గంలో పాతకోట పక్కనుంచే వెళ్ళినాము.

అది చాలా శిథిలావస్థలో ఉన్నందున బస్సు దిగి లోపలికి వెళ్ళి చూడడం అవసరంలేదని మా మార్గదర్శి చెప్పడంవల్లనూ, తడవు లేనందువల్లనూ బస్సు దిగలేదు. అది పూర్వం పాండవులు వుండిన ఇంద్రప్రస్థమేనట! ఆ కోట హుమాయూనుచేత, షేర్‌షాచేత 1650—40 సం. నడుమ నిర్మింపబడిందని అంటారు.

తర్వాత మేము ఎర్రకోటవద్దకు వచ్చాము. అది చరిత్రప్రసిద్ధమైన దుర్గం. ఎర్రరాళ్లతో కట్టడంవల్ల దీనికీ పేరు వచ్చింది. సుప్రసిద్ధ మొగలు చక్రవర్తి షాజహాను తన రాజధానిని ఆగ్రానుంచి ఢిల్లీకి మార్చుకుని, 1639 లో ఈ కోటను నిర్మించటానికి ప్రారంభించాడు. ఇది పూర్తి కావడానికి తొమ్మిది కోట్ల రూపాయి లయింది. తొమ్మిదేండ్ల కాలం పట్టింది. ఇది యమునానదికి దక్షిణతీరాన ఉన్నది. యమునవైపు కోటగోడ ఎత్తు 90 అడుగులు. తక్కినవైపుల 75 అడుగులు. చుట్టుకొలత ఒకటిన్నర మైళ్లు. దీని అగడ్త వెడల్పు 75 అడుగులూ, లోతు 30 అడుగులూ ఉన్నది.

అయితే మొదట కట్టినమాదిరిగా ఈ కోట యిప్పుడు లేదట. మొగలు చక్రవర్తుల కాలంలో దీనిని మించిన కోట లేదు. కాని, తర్వాత భూకంపాలవల్ల ఇందులోని భవనాలు కొన్ని శిథిలమయిపోయాయి. 1630 లో నాదర్షా ఇండియామీద దండెత్తి వచ్చినప్పుడు దీన్ని పాడుచేసి, ఇచ్చటి ఐశ్వర్యంతోపాటు సుప్రసిద్ధమైన నెమలిసింహాసనాన్నికూడా పర్షియాకు తీసుకొని పోయాడు. 1759 లో మహారాష్ట్ర రాజులు మున్నగువారు మరొకసారి దీన్ని దోచుకున్నారు. 1798 లో గులాం కాదిర్ అనే రోహిల్లా నాయకుడు దీన్ని

తగలబెట్టాడు. 1857 లో సిపాయీకలహం సందర్భంలో ఇక్కడి గొప్పభవనాలు ధ్వంసంచెయ్యబడినవి. బ్రిటిష్ ప్రభుత్వంవారు, మొగలుప్రభువులలో కడపటివాడైన బహదూర్‌షాను నిర్బంధించి, ఇక్కడి తోటలను, భవనాలను విధ్వంసం చేశారు. ఈవిధంగా విభిన్న కాలాలలో ఇది పెక్కు విధాల ధ్వంసం చెయ్యబడినా, ఇప్పటికీ చూడ నైభవంగా ఉన్నదంటే వెనక మహోన్నత దశలో వుండినప్పు డెట్లుండేదీ మనం సులువుగా వూహించవచ్చు.

భారత దేశానికి స్వాతంత్ర్యం వచ్చినప్పుడు 1947 ఆగస్టు 15–వ తేదీని భారత ప్రధాని పండిత జవహర్‌లాల్ నెహ్రూ ఇక్కడనే త్రివర్ణ పతాకను ప్రతిష్ఠించారు. నాటి నుండి నేటివరకూ ఏటా స్వాతంత్ర్యదినంనాడు ఆయన ఇక్కడ పతాకోత్సవాన్ని జరుపుతూనే ఉన్నారు.

ఈ కోటకు ముఖ్యమైన ద్వారాలు రెండున్నవి. ఒక దానికి లాహోరుద్వారమనీ, మరొకదానికి ఢిల్లీ ద్వారమనీ పేర్లు. మనం కోటలోకి వెళ్లాలంటే లాహోరుద్వార మార్గంగానే వెళ్లాలి. లోపల ప్రవేశించడానికి మనిషికి రెండణాలు చెల్లించాలి. ఈ ద్వారం సుప్రసిద్ధమైన చాందినీచౌకు వైపునున్నది. మొగలు చక్రవర్తుల పరిపాలన కాలంలో ఈ ద్వారం ఎదుటనే మీనాబజార్ అనే ఉత్సవం జరుగుతూ వుండేది. ఇది పెక్కు శిఖరాలతో కూడి ఎంతో మనోహరంగా వుంటుంది.

ఈ లాహోరుద్వారంగుండా కోటలో ప్రవేశించగానే విశాలమైన హాలు వస్తుంది. దాని పొడవు 268 అడుగులు; వెడల్పు 27 అడుగులు. దాని మధ్యనుంచే మార్గం! మార్గా

నికి ఇరువై పులా రకరకాల అంగళ్లు రెండు అంతస్థులలో కాన వస్తాయి. ఆ అంగళ్లలో ముఖ్యంగా వినోదవస్తువులు అమ్ము తారు. ఈ ప్రదేశానికే ఛట్టా చౌక్ అని పేరు.

ఆ హాలు దాటి యింకా లోపలికి పోతే రెండు వేల చదరపుటడుగుల వైశాల్యం గల ఒక పచ్చికబయలు! దాని నడుమ పూర్వం ఒక క్రీడాసరోవరం వుండేదట. ఇప్పు డది కేవలం పచ్చికబయలు! దానితర్వాత ఎర్రటి పెద్దభవనం! అదే నౌబత్ ఖానా. కోట లోపలిభవనాలకు వెళ్ళాలంటే దీనిని దాటాలి. ఈ భవనం మేడమీదనే మంగళవాద్యాలైన ఢంకా, నౌబత్తులు మోగుతూ ఉండేవి. ఈ భవనం పొడుగు 99 అడుగులు ; వెడల్పు 68 అడుగులు.

నౌబత్ ఖానాను దాటగానే ఒక విశాలమైన ఖాళీ స్థలమూ, దాని కెదురుగా ఒక ఎర్రరాతి భవనమూ కాన వస్తాయి. ఆ భవనమే దివాన్-ఇ-ఆమ్. ఇది నాలుగడుగుల ఎత్తు గల తిన్నెమీద నిర్మితమయింది. ఈ భవనం 500 అడు గుల పొడవూ, 300 అడుగుల వెడల్పూ కలిగి వుంది. అనేక మైన చిత్రాలతో అలంకరింపబడి వున్నది. దీనిమధ్య పది అడుగుల ఎత్తులో చక్రవర్తి ఆసనం! అది రత్నాలతో పొదుగ బడివుండేది. అవన్నీ నూరేండ్ల క్రిందట అపహరించబడినవట.

దానికి క్రిందిభాగంలో 7 అడుగుల పొడవు, 3 అడుగుల వెడల్పు గల పాలరాతి తిన్నెమీద ముఖ్య మంత్రికీ, ఇతర మంత్రులకూ, రాయబారులకూ బంగారు, వెండి ఆసనాలు అమర్చబడేవి. ప్రతి దినమూ ఉదయం చక్రవర్తి యిక్కడ కొలువు తీరి, సైన్యవిన్యాసం పరీక్షించి, తర్వాత వ్యాజ్యా లను విచారించేవాడు.

ముఖ్యమంత్రి కూర్చుండే స్థలానికి ఎడమవైపు లాల్ పరదా అనే ఎర్రతెర—ఆ పేరుగల ద్వారం ఒకటి ఉన్నది. అది శిల్పకళతో ఎంతో ఆకర్షణీయంగా ఉన్నది. ప్రభువులకు ముఖ్యులయినవారే దాని మూలంగా రావచ్చును. తక్కిన వారికి అందుండి ప్రవేశం లేదు.

దివాన్-ఇ-ఆమ్ పడమటివైపున రంగమహాల్ ఉన్నది. ఇది 153½ అడుగుల పొడువు, 69½ అడుగుల వెడల్పు! అనేకములైన రంగులచిత్రాలతో ఇదిచక్కగా అలంకరింపబడినది. దీని లోకప్పులో చాల అద్భుతంగా పూవుల చిత్రాలున్నవి. షాజహాను కాలంలో ఇది వెండి బంగారాలతో అలంకరింపబడి వుండిందట. దీని వెనుకగోడ యమునానదివైపున్నది. దానికి మీదిభాగంలో అయిదు కిటికీలున్నవి. రాణీవాసంవారు ఆ కిటికీలలోనుంచే ఏనుగుల-అడవిమృగాల పోట్లాటను తిలకిస్తూ వుండేవారట. ఈ మహాలుకు మధ్యభాగంలో ఒక చిన్న క్రీడా సరస్సు వున్నది. అది ఎంతో ఆకర్షకమైనది. ఈ క్రీడా సరస్సులోని వాడిన నీరంతా మహాలుకు పక్కనున్న ఒక పెద్ద తొట్టెలోపడుతూ వుండేదట. క్రీడాసరస్సు 5 చదరపుగజాల నిడివి, నాలుగున్నర అడుగుల లోతూ కలిగి ఉన్నది.

ఆ తర్వాత ఉండే భవనమే దివాన్-ఇ-ఖాస్-దర్బారు భవనం. ఇది నాలుగున్నర అడుగుల ఎత్తు తిన్నెమీద కట్టబడిన పాలరాతి భవనం. ఇది 90 అడుగుల పొడుగు, 67 అడుగుల వెడల్పు గలిగి వున్నది. ఈ భవనానికి ఆధారంగా ముప్ఫయిరెండు స్తంభాలున్నవి. అవి శిల్పకళతో విలసిల్లుతూ ఉన్నవి. ఈ భవనపు లోకప్పు పూర్వం 29 లక్షల విలువ గల వెండి మొలామాతో అలంకరింపబడి వుండినదట. ఆ

కాలంలో ఇది భూతల స్వర్గంగా వుండేది. పాలరాళ్లతో కట్టబడిన యీ తిన్నె నడుమభాగంలోనే పూర్వం మయూర సింహాసనం వుండేది. ఆ సింహాసనం తయారవటానికి ఏడేండ్లు పట్టినది. తొమ్మిదికోట్ల రూపాయలు ఖర్చయినది. ఆ సింహాసనం లక్ష తులాల బంగారంతో తయారు చెయ్యబడింది. దానిమీద అసంఖ్యాకంగా నవరత్నాలూ తాపడం చెయ్యబడినవి. ఆ సింహాసనాన్ని 1739లో నాదర్‌షా పర్షియాకు తీసుకుపోయినాడు.

అక్కడినుంచి ముందుకు సాగిపోతూ వుంటే తస్‌బీఖానా మొదలైన సుందర భవనాలు కానవస్తాయి. పూజాగృహానికీ, శయనమందిరానికీ నడుమ న్యాయాన్ని సూచించే తులాదండం కానవస్తుంది. తాను పక్షపాతం లేకుండా ప్రవర్తిస్తానని సమ్రాట్టు దీనిమూలంగా సూచిస్తున్నాడని అంటారు!

శయనమందిరానికి సమీపంలోనే స్నానగృహం ఉన్నది. అందులో మూడు భాగాలు కలవు. అందు మొదటి గది దుస్తులు ధరించడానికి ప్రత్యేకింపబడినది. మధ్యభాగంలో చన్నీటిస్నానానికీ, వేడినీళ్ల స్నానానికీ తగిన ఏర్పాట్లున్నాయి. మూడవభాగంలో కేవలం ఉష్ణోదకస్నానానికే ఏర్పాట్లున్నవి. ఈ గదుల కిటికీలు గాఢమైన ఆకుపచ్చరంగు అద్దాలతో అమర్చబడినవి. ఇవి రాజకుటుంబంలోని వారికే ప్రత్యేకించబడినవి.

శయనమందిరానికి తూర్పుగా సమ్మన్‌బుర్జ్ అనే గోపురం ఉన్నది. మొగలుచక్రవర్తులకాలంలో దాని శిఖరం బంగారు పూత గల రాగిరేకులతో తయారు చెయ్యబడి వుండినది. ఇప్పుడు సున్నపు పూతగల శిఖరమే కానవస్తుంది.

మొగలుచక్రవర్తులు ప్రతినిత్యమూ ప్రాతఃకాలంలో ఉదయ భానుణ్ణి ఆరాధించడానికి యిక్కడికి వచ్చేవారు. తదనంతరం యిక్కడనుండే తమ ఉద్యోగు లర్పించే వందనాలను స్వీకరించేవారు.

స్నానమందిరానికి ఉత్తరదిశను మోతీమసీదు అనే మసీదు ఉన్నది. ప్రభువుల కుటుంబంకోసం దీన్ని ఔరంగజేబు పాదుషా 1662-వ సంవత్సరంలో నిర్మించాడు. దీని నిర్మాణానికి రెండు లక్షల రూపాయలు ఖర్చయినవట. ఇది పాలరాతితో కట్టబడింది. పొడవు 40 అడుగులు. వెడల్పు 30 అడుగులు. ఎత్తు 20 అడుగులు. దీని ద్వారం ఇత్తడితో అతి రమ్యంగా తయారు చెయ్యబడింది. గోపురాలు మొదట్లో బంగారు పూతకల రాగిరేకులతో అలంకరింపబడినవి. అవి నశింపగా దరిమిలాను పాలరాతితో తిరిగి నిర్మింపబడినవి.

ఇక్కడ వున్న హాయాత్ బక్ష్ తోట చాలా అందమైంది. మొగలులకాలంలో ఇక్కడ రకరకాల పూలచెట్లు పెంచబడేవి. మునువుండిన పూలతోటలో సగంభాగం మాత్రమే యిప్పుడున్నది; తక్కిన భాగాన్ని సైన్యం ఆక్రమించినది. ఈ తోట మధ్య సుందరమైన ఒక తటాకం ఉండినది. దానికి నాలుగువైపులా విశాలమైన కాల్వలు ఉండినవట. ఇప్పుడు అవేవీ లేవు.

ఈ హయాత్ బక్ష్ తోటలో సవాన్, భాదన్ అనే పేరుగల రెండు మండపాలున్నవి. వీటిలో మొదటిది ఉత్తరం వైపునా, రెండవది దక్షిణం వైపునా ఉన్నవి. వీటి గోడలలో నీటి తొట్టెలు అమర్చబడి వున్నాయి. వర్షం పడుతూ వున్నట్టే వాటిలోనుంచి నీరు వస్తూవుంటుంది. ఈ రెండింటికీ నడుమ

భాగంలో ఒక ఎర్రరాతి మండపం ఉన్నది. ఇది కొలనుకు మధ్యభాగంలో ఉన్నది. దీనికి జఫర్ మహల్ అని పేరు. దీనికి తూర్పువైపు ఒక కర్రవంతెన వుండేదట.

కోటలో తూర్పుగా ఉన్న మూలలో షా బుర్జ్ లేక రాజు గోపురం అనే భవనం ఉన్నది. ఇది ప్రభువు మిత్రులతో రహస్యాలోచనలు చేసేచోటు. ఇది 63 అడుగుల పొడవూ, 32 అడుగుల వెడల్పూ కలిగివున్నది.

జఫర్ మహలుకు ఎదురుగానే ఒక చిన్న భవనం పాలరాతితో కట్టబడి ఉన్నది. దీని పేరు హీరామహల్. దీన్ని 1842 లో కడపటి మొగలుప్రభువు బహదూర్ షా నిర్మించాడు. ఇక్కడినుంచి చూస్తే యమునానదీ దృశ్యం మనోజ్ఞంగా కనబడుతుంది. అందుకోసమే ఈ నిర్మాణం!

కోటలో వుండే మరొక భవనం, ముంతాజమహలు. దీన్ని ఛోటా రంగమహల్ అని కూడా అంటారు. రాజ కుటుంబం ఇందులో నివసించేది. ఇది, తర్వాత మిలిటరీ చెర సాలగా ఉపయోగింపబడుతూ వచ్చింది. అందుకోసం యిందులో కొన్ని మార్పులు జరిగాయి. ఇప్పుడిది శిల్ప ప్రదర్శన శాలగా ఉన్నది.

ఇదే కాకుండా ఎర్రకోటలో మరిరెండు మ్యూజియంలున్నవి. ఒకటి ఇండియన్ మెమోరియల్ మ్యూజియము! ఇది ఛట్టాచౌకునకు తూర్పువైపున ఉన్నది. మొదటి ప్రపంచ మహాయుద్ధం జరిగినతర్వాత ఏర్పరచబడినది. ఇందులో యుద్ధసామగ్రి, చిత్రాలు, నాణెములు మొదలైనవి వున్నవి. రెండవది ఢిల్లీ మ్యూజియం. ఇది రంగమహాలుకు దక్షిణం వైపున ఉన్నది. ఇందులో ప్రాచీన లిఖితగ్రంథాలు, చిత్రాలు,

దుస్తులు, కత్తులు—మొదలైనవి భద్రపరచబడి వున్నవి. ఇవన్నీ మొగలురాజులనాటివి.

మనం తిరిగీ వెనక్కి వస్తూ వున్నప్పుడు నౌబత్ ఖానాకు వచ్చే దారిలో ఎడమవైపు ఒక రోడ్డు కానవస్తుంది. అది తిన్నగా ఢిల్లీ గేటువద్దకు వెళుతుంది. ఈ గేటుకు ఎలిఫెంట్ గేట్—లేక గజద్వారం అని నామాంతరం. ఆ ద్వారానికి చెరి ఒక వైపూ పెద్ద రాతిఏనుగులు వుండడంబట్టే యీ పేరు వచ్చింది. కాని ఈ ఏనుగులు మొదట్నుంచీ వున్నవి కావట! పూర్వం వీటి స్థానంలో రెండు పెద్ద ఏనుగులూ, వాటిమీద ఇద్దరు వీరులూ ఉండగా, ఔరంగజేబు వాటిని పడగొట్టించాడట! దరిమిలాను 1903 లో లార్డు కర్జను ప్రభువు—ఆ ఏనుగుల ప్రమాణంలోనే రెండు ఏనుగులను చెక్కించి నిలిపాడు. వెనుకటి ఏనుగుల శిథిలాలు మ్యూజియములో భద్రంగా ఉంచబడినవి.

ఇవన్నీ త్వరత్వరగా చూచిరావడానికే చాలాసేపయింది. మేము బసకు వచ్చేసరికి ఒంటిగంట దాటింది.

దక్షిణదేశంలో భోజన సదుపాయం ఉన్నట్లుగా ఉత్తరాదిని ఉండదని మన కందరికినీ తెలుసును. ఉదయం కాఫీ ఫలాహారాలకు మనిషికి పన్నెండణాలు అయి వుండును. అదీ ఉప్మా, కాఫీలకు మాత్రమే! పార్లమెంటుమెంబర్ల కాంటీను లో తప్ప మరొకచోట ఇంత చౌకగానూ, రుచికరంగానూ లభించదట. భోజనానికి రూపాయి పావలా తీసుకుంటారు. అదీ చవుకగా కుదిరినట్లే భావించాలి. నాడు మా భోజనం ఉత్తర–దక్షిణదేశ సంప్రదాయాలు మిళితమైనదిగా వున్నది. ఉత్తరదేశ సంప్రదాయంప్రకారం పెద్దపళ్లెంలో మధ్య కొంత

అన్నం పెట్టి చుట్టూ కప్పులతో చారు, సాంబారు, మజ్జిగ, మొదలైనవి ఉంచారు. కావలసినవారికి రొట్టెలూ వేశారు. దక్షిణాది పద్ధతిలో కూరగ, సాంబారు, చారు, మజ్జిగ వున్నవి. అన్నట్టు మరచా! మజ్జిగ కాదు. గడ్డపెరుగే యిచ్చారు. ఆకలితోవున్న మాకు ఆ భోజనం బలే రుచికరంగా వుండినది.

భోజనానంతరం కొంచెంసేపు విశ్రాంతి తీసుకున్నాం. ఇంతలో చాకలి రావటంవల్ల మురికి అయిన బట్టలు వేశాము. మరునాడు సాయంకాలం 6 గంటలలోగా బట్టలు శుభ్రం చేసి యివ్వడానికి ఆ రజకుడు సమ్మతించాడు. బట్టకు మూడణాలు ఛార్జి! కాని అంత స్వల్పకాలంలో చక్కగా చలువచేస్తే అంతమాత్రం యివ్వడం సబబే. అతడు ఆ విధంగానే బట్టలుతికి తెచ్చి మాట దక్కించుకున్నాడు. మాకూ సంతృప్తి కలిగింది.

ఊరినుంచి బయలుదేరి వచ్చినదగ్గరనుంచీ ఎవ్వరికీ యింతవరకూ జాబులు వ్రాయడానికి అవకాశం లేకపోయింది. మాకు రావలసిన జాబులూ వున్నవి. మా ఢిల్లీ అడ్రసుకు రావలసిన జాబులన్నీ న్యూఢిల్లీ సేవసుమాస్టరుగారిద్వారా రావాలి. శ్రీ యజ్ఞనారాయణయ్యరుగారు తమ మోటారు సైకిలుపై అక్కడికి వెళ్లి రెండున్నరకల్లా జాబులు తెచ్చి యిచ్చారు. మా బసకు సమీపంలోనే నార్త్ అవెన్యూ పోస్టాఫీసు! మాలో కరస్పాన్డెన్సుకోసం ప్రత్యేకంగా ఉన్న శ్రీ టి. ఎన్. వేణుగోపాల్‌గారివద్ద కార్డులూ, కవరులూ, స్టాంపులూ నిల్వవున్నందున—మేము వాటిని ఉపయోగించి —జాబులు వ్రాసి పోస్టాఫీసుకు పోయి—ఇంకా టయిమున్నందున సంతోషించి, వాటిని పోస్టుచేశాము. అప్పటికి మా బస్సు వచ్చింది. అందరమూ బయలుదేరి బిర్లా మందిరానికి

దారితీశాము. అలా వెళ్ళేటప్పుడు ముందుగా 'జంతర్ మంతర్' అనే ప్రాచీన ఖగోళ పరిశోధనశాలను చూశాము. రాజస్థానంలోని ఇప్పటి జయపూరును నిర్మించిన రాజా జయసింహుడు దీన్ని నిర్మించాడట. సూర్యచంద్రుల గమనాన్ని బట్టి, ఆ యా సందర్భాల్లో ఏర్పడే నీడలనుబట్టి సులభంగా గంటలనూ, నిమిషాలనూ, సెకండులనూ కూడా నిర్ణయించవచ్చును. ప్రాచీనవిజ్ఞానానికి ఇది గొప్ప తార్కాణం. స్థానిక విద్వాంసు డొకడు ఆంగ్ల భాషలో అది పనిచేసే విధానాన్ని వివరించి చెప్పాడు. సూర్యచంద్రులను గురించి మాత్రమే కాక—రాశులూ, నక్షత్రాలూ మున్నగువాటి విషయంకూడా ఆయన వివరించాడు. ఆతని కొక రూపాయి దక్షిణ సమర్పించి, ధన్యవాదా లర్పించి మేము మళ్ళీ బస్సుఎక్కి కూర్చున్నాము. మూడున్నరకు అక్కడనుంచి అందరమూ బయలుదేరి సౌత్ ఇండియన్ హయ్యర్ సెకండరీ స్కూలు (బ్రాంచి స్కూలు) వద్ద బస్సు నిలిపి, ఆ ప్రక్కనే వున్న బిర్లామందిరానికి వెళ్ళాము.

అది కోటీశ్వరుడూ, వర్తకులలో అగ్రగణ్యుడూ అయిన బిర్లా నిర్మించిన దేవాలయం! అందువల్ల దానికి బిర్లామందిర మనే వాడుక. ఆ దేవాలయంలో ప్రధానమూర్తులు లక్ష్మీనారాయణులు. నూతన పద్ధతిలో కట్టబడిన ఆ దేవాలయ కుడ్యాలపై భగవద్గీతకు, తక్కిన ప్రాచీన పురాణాదులకు సంబంధించిన చిత్రాలూ, వానికి సంబంధించిన శ్లోకాలూ చిత్రించబడి వున్నాయి. గీతార్థ ప్రచారంకోసం చాలాచోట్ల ఆ మహానుభావుడే ఇలాంటి దేవాలయాలు కట్టించాడు!

గంటకు పైగా అక్కడ వుండి, తర్వాత బడికి వెళ్ళాము.

అప్పుడే బడి విడిచిపెట్టారు. పిల్లలందరూ ఇళ్లకు పోతున్నారు. ఆంధ్రులూ, అరవలూ, మలయాళీలూ, కన్నడులూ అనే భేదం లేకుండా దాక్షిణాత్యులందరూ తమ పిల్లలను అక్కడ చదివిస్తున్నారు. హిందీతో పాటు మాతృభాషకూడా అక్కడ బోధింపబడుతుంది.

మేము వెళ్లేసరికి మాకోసం అక్కడి ఉపాధ్యాయులందరూ నిరీక్షిస్తున్నారు. వారి కాంటీనులో మాకోసం ప్రత్యేకంగా కాఫీ, ఫలాహారాలు తయారుచేయించి, స్వాగతం యిచ్చారు. మా లీడరు వారికి కృతజ్ఞత తెలియజేశాడు.

తర్వాత మేము పట్టణంలోని ముఖ్యమైన కొన్ని వీధుల గుండా ప్రయాణంచేసి యమునాబ్రిడ్జిని సమీపించాము. అది ఆగ్రాలోని వంతెన పద్ధతినే—క్రింద రోడ్డు, మీద రైలు రోడ్డు కలిగి, ఇరుకుగానే ఉన్నది. ఆగ్రాలో మాదిరిగానే ప్రతి పది నిమిషాలకూ ఒక్కసారి ఒకవైపునుంచి యింకొకవైపునకు బండ్లూ, బస్సులూ మొదలైన వాటిని వదలుతూ వుంటారు. మేము యమున అవతలి ఒడ్డుకు వెళ్లి తిరిగి వచ్చాము. ఏడుగంటలు దాటేసరికి న్యూఢిల్లీ రైల్వేస్టేషనుకు వచ్చాము. అక్కడ మాబస్సును అరగంటకు పైగా నిలిపారు, ఏమయినా జాబులు వచ్చాయేమో చూడడానికి ఇద్దరు ముగ్గురు వెళ్లారు. దగ్గర షాపులకు కొందరు వెళ్లారు. కొందరం స్టేషనులోనే ఇటూ అటూ తిరుగుతూ కాలంగడిపాము.

క్రిందటిరోజు అర్ధరాత్రిపూట రావడంవల్ల న్యూఢిల్లీ స్టేషను బాగా చూడడానికి వీలులేకపోయింది. బండీ దిగిన వెంటనే బస్సులకు వెళ్ళడంవల్ల కూడా దాని వివరాలు తెలుసుకో వీలుకలగలేదు.

క్రొత్తఢిల్లీ స్టేషను నూతనంగా కట్టబడినది కావడంవల్ల నవీనపద్ధతులలో చాలా సౌకర్యాలతో ఉన్నది. స్నానాల గదులూ, విశ్రాంతి గదులూ, దొడ్డి సౌకర్యాలూ ఎంతో అనుకూలంగా ఉన్నవి. పెద్ద జంక్షనయిన ఢిల్లీ స్టేషనులోకంటె ఇక్కడనే సౌకర్యాలు అధికంగా ఉన్నవని చెప్పవచ్చు. రాత్రివేళలో విద్యుద్దీపాలూ, ట్యూబ్ లైట్లూ దానికి క్రొత్త శోభను తెస్తూవుంటవి. తర్వాత మేము బసకు వెళ్లి భోజనం చేసి పడకలు వేశాము. పగలు చాలచోట్లు తిరిగి, అలసి పోవడంవల్ల హాయిగా నిద్రపట్టింది.

మరునాడు సెప్టెంబరు 22వ తేదీ. ఆ రోజున చూడ వలసినవి చాలా ఉన్నందున ఏడు గంటలకే బయలుదేరాము. తిన్నగా చాందినీ చౌకుకు వెళ్లాము. ఢిల్లీలో జనసమ్మర్దం ఎక్కువగా వున్నచోట్లలో ముఖ్యమైన బజారులన్నీ ఇక్కడే వున్నవి. ఈ భాగంలో నే ట్రాంలు ఉన్నవి. కాని అవి వాటి దీనస్థితిని బాగా వ్యక్తంచేస్తూ ఉన్నవి. 1933లో నేను తొలిసారిగా మద్రాసులో చూచిన ట్రాములకంటే కూడా ఇవి చాలా వెనుకబడి వున్నవి. వీటిలో ప్రయాణంచేసే దానికంటె నడిచి వెళ్ళితేనే గమ్యస్థానాన్ని ముందుగా చేరుకోవచ్చు. టిక్కట్లు యివ్వడంలో కలిగే జాప్యానికి అవధే లేదు. ట్రాముమీద టిక్కట్టులేకుండా ప్రయాణం చెయ్యడమూ సులభమే! బంపర్లమీద నిలిచి ప్రయాణం చేసేవారిని కండక్టర్లు గమనించేటట్టూ కానరాలేదు.

బండ్లను నిలిపే స్థలంలో రోడ్డుపక్కగా మా బస్సు నిలిపి, దగ్గరలోనే వున్న జుమ్మా మసీదుకు వెళ్లినాము. భారత దేశంలో—ఒక్క భారతదేశంలోనే కాదు—ప్రపంచంలో

వున్న మసీదులలో ఇదే పెద్దదని చెబుతూ వున్నారు. దీనిని 1653 లో షాజహాను చక్రవర్తి నిర్మించాడు. దీనికి రమారమి పది లక్షల రూపాయలు వ్యయమయినదట! దీని నిర్మాణంలో పాలరాళ్లూ, ఎర్రరాళ్లూ ఉపయోగించబడ్డాయి. ఇది చాలా విశాలమైందని చూస్తేనే తెలుస్తున్నది. వేలకొద్దీ జనం నమాజు చేసుకోవడానికి ఇది ఎంతో అనువై వున్నది.

ఆ మసీదునూ, దాని పరిసరాలనూ చూచినతర్వాత మా జట్టుదారులు కొందరు కొన్ని వస్తువులు కొనడానికి వెళ్లారు. వాళ్లు తిరిగివచ్చాక మేము బిర్లా భవనానికి వెళ్లాము. గాంధి మహాత్ముడు ఢిల్లీలో వున్నప్పుడు బసచేసే చోటు అదే! దాని వెనకవైపున ఉన్న మైదానంలోనే ఆయన ప్రతినిత్యమూ సాయంకాలం ప్రార్థనలు జరిపేవారు. అక్కడే ఆయనను నాథూరాం వినాయక్ గోడ్సే తుపాకితో కాల్చాడు. గాంధి మహాత్ముడు తుపాకిదెబ్బకు గురి అయిన ఆ స్థలంకూడా చూచాము. చూచేటప్పుడు ఒళ్లు జల్లుమన్నది.

అక్కడినుంచి బయలుదేరి రాష్ట్రపతిభవనం చూడడానికి వెళ్లాము. ఆ భవనానికి సమీపంగానే ఒక పెద్దగేటూ, దగ్గరగా ఐదవజార్జి చక్రవర్తి విగ్రహంతో కూడిన ఎత్తయిన వేదికా ఉన్నవి. 1914-వ సంవత్సరంలో జరిగిన ప్రపంచ మహాయుద్ధంలో భారతదేశ సైనికులు పాల్గొని మిత్రమండలికి మహోపకారం చేశారు. వీరి సహాయం మూలానే ఆంగ్లేయులకు విజయం చేకూరినట్లు అందరూ చెప్పుకునేవారు. ఆ వీరుల స్మృతిచిహ్నంగా ఈ గేటు నిర్మించబడినదట! ఇండియా గేటు అనేది ఇదే! బొంబాయిలో సముద్రతీరాన—ఊరిలో ప్రవేశించడానికి ముందు 'గేట్ వే ఆఫ్ ఇండియా' అనే పెద్ద

గేటు ఉన్నది. అది ఇండియా ప్రవేశానికి ఉద్దేశించబడినది. ఇది వీరుల సంస్మరణార్థం ఉద్దేశింపబడినది.

రాష్ట్రపతి భవనం ముందు మేము బస్సు నిలిపిన తర్వాత ఒక రిద్దరు ప్రధానద్వారంవద్దకు వెళ్లి లోనికి వెళ్ల వచ్చునేమో తెలుసుకు వచ్చారు. రాష్ట్రపతి భవనంలోపల ప్రవేశించడానికి మాకిదివరకే అనుమతి లభించింది. కనుక నిర్ణీత సమయానికే అక్కడికి వెళ్లాము. భవనాన్ని చూడ డానికి అనుమతి వున్నది. కాని రాష్ట్రపతి రాజేంద్రప్రసాదు గారిని చూడడానికి అనుమతి లభించలేదు.

సాధారణంగా ఉత్తర దేశానికి యాత్రకు వెళ్లే వాళ్లు డిల్లీకి తప్పక వెళ్లుతారు. అక్కడ రాష్ట్రపతి రాజేంద్ర బాబును, ముఖ్యమంత్రి శ్రీ జవహర్‌లాల్ నెహ్రూనూ దర్శించి—అలా దర్శించినామని ఘనంగా చెప్పుకుంటారు. వారితో కొద్ది నిమిషాలపాటు సంభాషించే అవకాశందొరికితే తరించినట్లు భావిస్తారు. కాని, ఆ దర్శనమనేది అందరికీ లభ్యం కాదు. దగ్గిరున్నవారు తెలియజేస్తే తప్ప రాష్ట్రపతికీ, ప్రధానికీ ఈ సంగతులు తెలియనే తెలియవు. మేము రమారమీ ఏభై మంది వుపాధ్యాయులం—వివిధ విషయా లను బోధించేవారం, జన్మానికి శివరాత్రిగా ఒకసారి ఉత్తర ప్రాంతానికి వస్తున్నామని, ఒకసారి దర్శనానికి అనుమతిస్తే సంతోషిస్తామనీ ముందుగానే దరఖాస్తులు పెట్టుకున్నాము శ్రీ రాజేంద్రప్రసాదు, శ్రీ నెహ్రూ, శ్రీ రాధాకృష్ణన్ గార్లకు. శ్రీ రాధాకృష్ణన్ గారు మాత్రం అనుమతి యిచ్చారు. తక్కిన వారిద్దరూ అనుమతి నివ్వడం లేదు. కాని, మాకంటె ఒక రోజు మాత్రం ముందుగా డిల్లీ వచ్చి, మాతో వివిధ స్థలాల్లో

కలుసుకుంటూవున్న క్రిస్టియన్ కాలేజి హైస్కూలు విద్యార్థు లకు మాత్రం అనుమతి లభించింది. అనుభవజ్ఞులైన ఉపా ధ్యాయులను కాదని ఒకటోఫారం నుంచి ఆరవఫారంలోగా ఉండే విద్యార్థులకు అనుమతి ఇవ్వబడినదంటే—దానికి కారకులైన ఘరానామనుష్యులెవరో వారిప్రక్కను ఉండాలి. అలాటి గాడ్‌ఫాదర్లు లేనివారికి దర్శనం ఎలా దొరుకుతుందీ?

రాష్ట్రపతి భవనాన్నయినా చూడడానికి అనుమతి లభించినందుకు సంతోషిస్తూ మేము అక్కడకు వెళ్లాము. ఇప్పుడయితే అంత గొప్ప భవనాన్ని కట్టించి వుండరు. 1930 లో పరప్రభుత్వంవారి హయాములో జరిగిన నిర్మాణం ఇది! పూర్వం ఇది రాజప్రతినిధి బస. ఇప్పుడు ఇండియా ప్రెసిడెంటు భవనం. దీనిలో ఒక భాగంలో చక్కని మ్యూజియం ఉన్నది. అందులో శిల్పకళ ఉట్టిపడుతూవున్న విగ్రహాలూ, తదితర కళాఖండాలూ పెక్కులున్నవి. మరొక భాగంలో పూర్వపు రాజులయొక్క, వైస్రాయిలు మున్నగు వారియొక్క చిత్రాలూ, వారు ఉపయోగించే వస్తువాహ నాలూ ఉన్నవి. ఈ భవనానికి వెనుక సుందరమైన ఉద్యాన వనం ఒకటి ఉన్నది.

రాష్ట్రపతి భవనాన్ని చూచిన తర్వాత మేము తిన్నగా పార్లమెంటుభవనాన్ని చూడడానికి వెళ్ళాము. దాన్ని చూడడానికీ అనుమతి కావాలి. అనుమతి మాకు ముందుగానే లభించింది. గుండ్రంగా ఉండే భవనాల్లో ప్రపంచం అంతటిలోనూ ఈ భవనమే పెద్దదట. దీని చుట్టు కొలత అరమైలు! రాజ్యసభ, లోకసభ కూడా ఇందులోనే సమావేశమవుతూ ఉంటాయి. ఇది ముఖ్యంగా చూడతగినది.

దీనిని చూచాక మేము ఆలిండియా రేడియో కేంద్రానికి వచ్చాము. ఇది చూడడానికీ అనుమతి కావాలి. మేము ముందుగా తెలియజేయనందున అనుమతి రాలేదు. అయినా —ప్రయత్నించి అనుమతి లభిస్తే చూడాలని సంకల్పించాము. అది రావడానికి కొంత ఆలస్యమైంది. అధికారులు నూయందు అభిమానముంచి, ఆయా శాఖలు ఎలా పనిచేసేదీ వివరించి చెప్పడానికి ఇద్దరు ఉద్యోగులనుకూడా నియమించారు. ఇది పార్లమెంటు భవనానికి ఈశాన్యంవైపున దానికి సమీపంలోనే ఉన్నది, ఆసియా ఖండంలోని పెద్ద రేడియోస్టేషనులలో ఇది ఒకటి. ఉద్యోగులు ఆయా వివరాలు చెప్పారే కాని అవి సులభంగా అర్థమయేటట్లు లేవు. ప్రతిదినమూ చూచేవారు వాటిని సులభంగా ఆపరేట్ చెయ్యగలరు. అవి పనిచేసే విధానం మాకు చాలా ఆశ్చర్యాన్ని కలిగించినది. అక్కడినుంచి బయటికి వచ్చేసరికి ఒంటిగంట దాటినది. అందువల్ల వెంటనే బసకు వెళ్లి భోజనంచేసి, గంటసేపు విశ్రాంతి తీసుకున్నాము.

తర్వాత మూడు గంటలకు బయలుదేరి సౌతిండియన్ హయ్యర్ సెకండరీ స్కూలు ప్రధాన భవనానికి వెళ్ళాము. అది నూతనంగా కట్టబడిన పెద్ద భవనం. ఒక పెద్ద కాలేజీ వలె కానవచ్చింది. అక్కడి ఉపాధ్యాయులూ, ప్రధానోపాధ్యాయులూ, పాలకవర్గంలో ముఖ్యులైన శ్రీ రామయ్య గారూ మాకు స్వాగతం యిచ్చారు. ఆ భవనాన్ని పూర్తిగా చూచి, అక్కడి విద్యాబోధన పద్ధతులను తెలుసుకుని, అక్కడినుంచి పూసా ఇన్‌స్టిట్యూటుకు బయలుదేరి వెళ్లాము. కాని, నాడు అది ముయ్యబడివున్నది. అది పట్టణానికి చాలా

దూరంలో ఉన్నది. ఇంత దూరమూ వచ్చి వృథాగా వెనుకకు వెళ్లడం దేనికని, దగ్గరలోనేవున్న డైరీఫారమునూ, వ్యవసాయ పరిశోధన శాఖనూ చూచాము. డైరీఫారంలో పెక్కు దేశాలకూ, జాతులకూ చెందిన గోగణం పెంచబడుతూఉన్నది. అక్కడి పాలు ఢిల్లీకి విక్రయార్థం పంపబడుతూ ఉంటవి. మాతో శ్రీ రామయ్యగారుకూడా తమ కారులో వచ్చారు. ఆయన పరిశోధనశాఖలోని వివిధ విషయాలను వివరించి చూపారు.

అక్కడినుంచి మేము తిన్నగా రాజఘాటుకు వెళ్లాము. రాజఘాటు గాంధిమహాత్ముని సమాధి స్థలం. అది యమునా నదీ తీరానికి సమీపంలో వున్నది. అది పవిత్ర యాత్రా స్థలంగా పేరుపడినది. భారతదేశానికి వచ్చిన విదేశీయులు కూడా తప్పక ఇక్కడికి వచ్చి సమాధిపై పూలమాలలు వేసి నమస్కరించి వెళుతూవుంటారు. మేము అక్కడికి వెళ్లి పూల మాలలూ, పూవులూ సమర్పించాము. కొందరం భగవద్గీత ద్వితీయాధ్యాయం పారాయణం చేశాము.

తర్వాత మేము అశోక స్తంభం చూచాము. అది ఒక భవనం మీదిభాగంలో ప్రతిష్ఠితమై ఉన్నది. దానిమీద బౌద్ధధర్మాలు చెక్కబడి వున్నవి. ఈ మందిరమూ, దీని పరిసర మందిరాలూ చాలా శిథిలావస్థలో వున్నవి. మందిరం పైభాగంలో డాబామీద ఈ స్తంభాన్ని నిల్పడం చాలా ఆశ్చర్యాన్ని కలిగించింది. 1351-1358 నడుమలో వుండిన ఫిరోజ్ షా తుగ్లకు దీని నిక్కడికి తీసుకువచ్చి ప్రతిష్ఠించాడని చెబుతారు.

అక్కడినుంచి మేము తిన్నగా సౌతిండియన్ బ్రాంచి

స్కూలువద్దకు వచ్చాము. ఆ దినంకూడా మాకు అక్కడివారు అల్పాహారవిందు ఏర్పాటు చేశారు. మేము రావడం కొంత ఆలస్యమయింది. అయినా మా కోసం అక్కడి ఉపాధ్యాయు లందరూ నిరీక్షిస్తున్నారు. అక్కడనుంచి తిరిగి బయలు దేరే సరికి రమారమి ఏడు గంటలయింది. సరిగా ఏడున్నరకు మేము ఉపరాష్ట్రపతి శ్రీ రాధాకృష్ణన్ గారి భవనానికి వెళ్ళ వలసి వున్నది. అందువల్ల వెంటనే బయలుదేరి అక్కడికి వెళ్ళాము. మా రాక తెలియగానే శ్రీ రాధాకృష్ణన్ గారు లోపలనుండి బయటికి వచ్చి పది నిమిషాలపాటు ఇష్టాగోష్ఠిగా మాట్లాడినారు. ఆయన మొదట్లో అరవంలోనూ, తర్వాత తెలుగులోనూ మాట్లాడి, మేము ఏయే స్థలాలు చూచినదీ, ఎక్కడెక్కడకు వెళ్లేదీ తెలుసుకున్నారు. మర్నాడు సాయంత్రం రామలీలా మైదానంలో జరిగే బహిరంగ సభకు తప్పక వెళ్ళవలెననీ, ప్రధాని ప్రసంగిస్తారనీ చెప్పారు. ఆ సంగతి మాకు ముందే తెలుసును. మేము వెళ్ళదలచుకునే ఉన్నా మని తెలియజేశాము. తర్వాత ఆయనవద్ద సెలవుతీసుకుని బసకు వెళ్ళినాము.

ఇక రాత్రి కాంటీనులో భోజనం చెయ్యకుండా తిన్నగా మా సామానులతో స్టేషనుకే పోవాలని నిర్ణయించుకున్నాము. కాంటీను భోజనం చాలామందికి నచ్చలేదు. భోజనం ఎలా వున్నా అచటివారి నిర్లక్ష్యభావం, ప్రవర్తనా ఎవ్వరికీ సుతరామూ కిట్టలేదు. మా ముఖాలు చూస్తే మేము బడిపంతుళ్లమని గ్రహించారేమో, అక్కడివారు! మావద్ద డబ్బు తీసుకుంటున్నా ఉచితంగా పెట్టిన ధోరణిలో వుండడం మాకు కష్టమనిపించింది. రాత్రినుంచీ మరి మా కక్కర్లేదని

ముందుగానే చెప్పేశాము. అదీకాక బసకున్నూ ప్రతిదినమూ కొంత సొమ్ము యివ్వవలసి వుంటుంది. మా టూరిస్టుకారును స్టేషనులో ఉంచడానికి దినానికి పది రూపాయలు ఎలాగూ ఇచ్చుకోవాలి. మేమింకా ఆ వూళ్లో ఉండవలసినది మరి ఒక్కరోజు మాత్రమే. ఆ రోజు మా కారులోనే కాలక్షేపం చెయ్యవచ్చును. న్యూఢిల్లీ స్టేషనులో స్నానాదులకు చాలా సౌకర్యంగా ఉంటుంది. మూడవ రోజు ఎవరి యిష్టంచొప్పున వారు తిరిగి రావచ్చనీ, ఎక్కడికి తిరిగినా రాత్రి తొమ్మిది గంటలలోపున కారుకు వచ్చితీరాలనీ ఏర్పాటు. అందువల్ల ఆ రాత్రికి స్టేషనుకు పోవలసిందే! రాత్రికి భోజనం సిద్ధం చెయ్యవలసిందని చెప్పి వంటవారికి వార్తకూడా పంపాము.

మేము బసకు వచ్చేసరికి చాకలి బట్టలతో సిద్ధంగా ఉన్నాడు. ఒక్క తుండుగుడ్డ అయినా పోకుండా భద్రంగా బట్టలన్నీ తెచ్చాడు. బట్టలు చక్కగా తెల్లగా వున్నవి. మేము వాటిని తీసుకుని, వచ్చిన బస్సులోనే తిన్నగా స్టేషనుకు వెళ్ళాము. మమ్మల్ని స్టేషన్‌లో కలుసుకుంటానని శ్రీ యజ్ఞనారాయణయ్యరుగారు స్కూలునుండే వెళ్ళిపోయినారు.

మేము రాత్రి ఎనిమిదిన్నరకు స్టేషనుకు వెళ్ళాము. బస్సుడ్రైవరు మమ్మల్ని జాగ్రత్తగా దింపి నమస్కరించాడు. మాకు బస్సుకు దినానికి రు. 120–0–0 అయింది. ఇది కొంత హెచ్చుగానే వున్నదని చెప్పాలి. ఆగ్రాలో—ఇంతకంటె ఎక్కువదూరమే తిరిగినా—తిరిగిన ఒక దినానికీ నూరు రూపాయల ఛార్జియే అయింది. ఇంతకూ యిది భారతదేశపు ముఖ్యపట్టణం గదా!

మేము స్టేషనులోకి వెళ్ళి—ఏ లైనులో వెతకినా మా

కారు కానరాలేదు. ఆ రైనులో వున్నదని కొందరూ, ఈ రైనులో వున్నదని కొందరూ, గంటలో వస్తుందని కొందరూ, గంటకుగాని రాదని కొందరూ ఎవరికి తోచినట్లు వారు చెప్పకోసాగారు. కొంతసేపు నిరీక్షించి స్టేషనుమాస్టరును కలిసికొని అడగ్గా "అది నాలుగు గంటలకే యిక్కడినుంచి ఢిల్లీకి వెళ్ళిపోయింది. మీరు రేపు ప్రయాణంచేసే బండి మసూరీ ఎక్స్‌ప్రెస్ కదా! ఆ బండి అక్కడినుంచే బయలు దేరుతుంది. అందువల్ల అక్కడికే పంపి వెయ్యబడింది" అని చావుకబురు చల్లగా చెప్పాడు. "అయ్యా! మేము మా బండీ యిక్కడ వుంటుందనే నమ్మకంతో వచ్చాము. మీరు ముందే తెలిపితే—మా బస్సును ఢిల్లీ స్టేషనుకే నడిపించి వుందుము. మాకోసం వంటలు సిద్ధపరచి, మా వంటవారు ఎదురుచూస్తూ వుంటారు. మీరు ఫోనుచేసి, ఆ కారును ఇక్కడకు రప్పించండి" అని మా లీడరు ముత్తయ్యగారు ప్రాధేయపడి చెప్పారు. అది సాధ్యం కాదనీ, కావలిస్తే పదకొండున్నర గంటల ప్యాసింజరులో అందరినీ ఢిల్లీకి పంపిస్తా ననీ అతడు అన్నాడు.

అట్టి సమయంలో శ్రీ యజ్ఞనారాయణ అయ్యరుగారు మోటారుసైకిలు ఎక్కి వచ్చారు. ఆయనతో ఈ సంగతి తెలపగా వెంటనే ఆయన ఢిల్లీస్టేషనుకు వెళ్ళి అక్కడి అధి కారులతో మాట్లాడారు. టూరిస్టుకారు వెనుకకు పంపడం సాధ్యంకాదనీ, పదకొండున్నర గంటల బండిలో పార్టీ మెంబర్లు వస్తే—ఆ బండి నిలిచిన ప్లాట్‌ఫారంమీదికి కారువచ్చే ఏర్పాటు చేస్తామనీ అన్నాడట. ఆయన వెంటనే వచ్చి ఈ వార్తను తెలియజేశారు. తర్వాత పదకొండున్నరకు ప్యాసిం

జరుబండీ ఒకటి వచ్చింది. దానిలో మేము ఢిల్లీ చేరేసరికి పన్నెండుగంట లయింది. అక్కడ రమారమి ఒక గంట కాచుకుంటేనేగాని మా కారు వున్నచోటు తెలియడమూ, దాన్ని మేము చేరడమూ జరగలేదు. అక్కడి ప్లాట్ఫారాలు మైళ్లకొద్దీ పొడవు ఉన్నట్టు తోచింది. సాధారణంగా కొన్ని పెద్ద స్టేషన్లలో ఒక ప్లాట్ఫారానికి రెండు నెంబర్లు వుండటం పరిపాటి. ఇక్కడో? మూడు నెంబర్లు వున్నాయి. మూడు పొడుగుపాటి ప్లాట్ఫారాలకూ తొమ్మిది నెంబర్లు వున్నాయి. అది కాక చిన్నవి నాలుగున్నట్లున్నది. అందువల్ల నెంబరును బట్టి ప్లాట్ఫారమును తెలుసుకోవడమే కొంత కష్టం.

డిల్లీ స్టేషను పెద్ద స్టేషనులలో ఒకటి. ఇది ఉత్తర రైల్వేకు కేంద్రం. ఇక్కడికి వచ్చే, పోయే రైళ్లకు హద్దూ పద్దూ లేదు. అందువల్ల మా కారును తెలుసుకోవడానికీ; దానిలో ప్రవేశించడానికీ గంటసేపయింది. పై చోట్ల ఎటువంటి యిబ్బంది లుండేదీ, ఎంత ఓపిక వహించవలసి వుండినదీ అప్పుడు అందరికీ బాగా అనుభవానికి వచ్చింది.

ఆ రాత్రి ఒంటిగంటకు మా భోజనం! భోజనం చెయ్యకపోతే వేడిచేస్తుందనే భయంతో ఇంత మజ్జిగ అన్నం తినవలసివచ్చింది. ఇలాంటి అకాల భోజనం చెయ్యడం జీవితంలో ఇదే తొలిసారి.

భోజనా లయాక కొందరు తమ బెడ్డింగులు పట్టుకొని ప్లాట్ఫారంమీదకు, వెయిటింగు రూములవద్దకూ వెళ్లారు. బాగా తలుపులు వేసుకుని, కిటికీలుమాత్రం తెరచి మేము బండిలోనే నిద్రించాము.

కడచిన రాత్రి నిద్రపోవడం ఆలస్యమైనందున వేకువను

తెలివి రాలేదు. నేను లేచేసరికి అయిదున్నర గంటలైంది. అప్పటికి వెయిటింగ్ రూములలోనూ, ప్లాట్‌ఫారాలపైనా పండుకున్న మిత్రులు—మణి మొదలైనవారు స్నానాదులు కూడా నిర్వర్తించుకుని వచ్చారు. న్యూఢిల్లీ స్టేషన్‌లో వున్నంత సదుపాయం లేకపోయినా యిక్కడ స్నానానికీ, తక్కిన అవశిష్టాలు తీర్చుకోవడానికీ సౌకర్యంగా వున్నదనీ, కావలసినవారు వోవర్ బ్రిడ్జి దాటి—ప్రక్కగా తిరిగితే—అక్కడ గదులు కానవస్తాయనీ చెప్పారు. నేను అవశిష్టాలు మాత్రం తీర్చుకుని వచ్చాను. నాడు యమునానదిలో స్నానం చెయ్యాలని కొందరం నిశ్చయించుకున్నాం. అందువల్ల ఇక్కడ స్నానం చెయ్యలేదు.

అప్పుడు చూస్తే ఢిల్లీ స్టేషన్ చాలా పెద్దదిగా కానవచ్చింది. ఇది అనేక మార్గాలకు కూడలి. ఇక్కడినుంచి ఒక లైను తూర్పుగా మురాదాబాదుకు వెళుతుంది. మరొకటి దీని ప్రక్కనే వున్న ఘాజియాబాదు మీదనుంచి ఆగ్నేయదిశగా అలీఘర్, టూండ్లాల మీదుగా కాన్పూరు, అలహాబాదులకు పోతుంది. ఒక లైను పడమరగా బికనీరు వెళుతుంది. వేరొకటి ఉత్తరంగా కల్కా, సిమ్లాలకు పోతుంది. మరొక చిన్నలైను సహారాన్పూరుకు వెళుతుంది. పెద్దలైనొకటి ఘాజియాబాదు మీదుగా సహారాన్‌పూరు చేరుతుంది. వాయవ్యదిశగా ఒక పెద్దలైను ఫిరోజ్‌పూరుకు పోతుంది. దక్షిణంగా మధురమార్గంగా వెళ్ళేలైను ఉండనే ఉన్నది. ఢిల్లీ భారతదేశ ముఖ్యనగరం కాబట్టి ఇన్ని మార్గాలు ఉండడం సహజమే! స్టేషను మద్రాసుసెంట్రలు కంటె ఎంతో పెద్దదీ, అందమయిందిన్నీ.

కాఫీ, ఫలాహారాలయాక అందరూ అన్నిస్థలాలకూ చెదిరిపోయారు. అయిదారుగురంమాత్రం యమునానదికి బయలుదేరాం. అది స్టేషనుకు తూర్పువైపున మైలున్నర దూరంలో ఉన్నది. మేము సందేహం తోచినచోట దారి అడుగుతూ యమునానదికి పోయి స్నానం చేశాము. అక్కడ నీరు పరిశుభ్రంగానే వుంది. అంటే బురదనీరు లేదు. గుండె లోతుదాకా స్నానఘట్టంలో మెట్లు దిగి తృప్తికరంగానే స్నానంచేశాం.

తర్వాత మార్గంలోని వింతలు చూసుకుంటూ స్టేషనుకు వచ్చి దుస్తులు వేసుకున్నాము. నాటిదినం ఎవరి భోజనం గురించి వారు ఏర్పాటుచేసుకోవలసిందే! కాని, ముగ్గురు నలుగురం మాత్రం వేరెక్కడికీ వెళ్ళదలచుకోలేదు. మా పాచకులు వారికోసం వంట చేసుకుంటారు కాబట్టి, వారు ఏమి చేసుకున్నా దానితో తృప్తిపడి అక్కడే భోజనంచెయ్యదలచుకున్నాము. వాళ్ళూ దానికి సమ్మతించారు. తర్వాత ఒకసారి చాందినీ చౌకుకు వెళ్ళి చూచి వచ్చాము. అది స్టేషనుకు చాలా సమీపంలోనే ఉన్నది. పిదప భోజనం చేసి, కొంచెంసేపు విశ్రాంతి తీసుకున్నాము.

తర్వాత మిత్రులు శ్రీ ఎన్. వెంకటేశన్‌గారు చౌకులో కొన్ని వస్తువులు కొనాలనీ, నన్నుకూడా రమ్మనీ కోరినారు. అందువల్ల ఇద్దరమూ బయలుదేరి వెళ్లాము. చౌకులో చాలాభాగం చూచినతర్వాత రిక్‌షా చేయించుకుని కానట్ సర్కస్ ప్రాంతాలు చూడడానికి వెళ్లాము. కానట్ సర్కసు భాగం గుండ్రంగా—నూతనంగా నిర్మింపబడిన భవనాల వరుస. అది పెద్ద పెద్ద షాపులుండే స్థలం. ఉన్నతమైన భవ

నాలనూ, వీధుల తీరునూ, జనసమ్మర్దాన్ని, షాపులనూ చూస్తే కలకత్తా స్ఫురణకు వస్తుంది. ఆ భవనాల వీథిలో కొంతసేపు తిరిగి, ఒక చోట కూల్ డ్రింక్స్ త్రాగి, రామలీలా గ్రౌండ్సుకు వెళ్లే బస్సుస్టాండు చేరాము. అప్పటికి అయిదు న్నర అయింది. ఆరు గంటలకు రామలీలా మైదానంలో శ్రీ జవహర్‌లాల్ నెహ్రూగారు ఉపన్యసిస్తారుకదా! ఆయన ఉపన్యాసం వినడానికి మేమక్కడకు వెళ్ళాలి. బస్సు చేరికి, అక్కడికి వెళ్లేసరికి ఆరు గంటలైంది.

మేము అక్కడికి వెళ్లేటప్పటికే జనం చాలామంది చేరారు. మీటింగు ఎంతవరకు జరుగుతుందో! ఏడున్నరకు బయలుదేరి వెనక్కు వెళ్లిపోవాలని మా ఉద్దేశం. అందువల్ల ఉపన్యాస వేదికకు దగ్గరగా కాకుండా దూరంగానే లౌడ్ స్పీకరు ఏర్పాటుచేసిన ఒకచోట కూర్చున్నాము. మా జట్టు లోని మరికొందరుకూడా ఆ సమయానికి అక్కడికి వచ్చారు. ఉపన్యాసం ఆరున్నరకే ప్రారంభమైనది. హిందీలోనే జరుగు తున్నది. కాని దూరశ్రవణ యంత్రాల అమరిక సరిగా లేనందున, స్పష్టంగా మాటలు వినబడలేదు. వేదిక దూరం గా ఉన్నందున, దానిమీది వ్యక్తులున్నూ స్పష్టంగా కాన రాలేదు. ప్రక్కనుంచే వాళ్ళ సంభాషణలూ, బటానీలూ, పాలకోవా మొదలైన వాటిని అమ్ముకునేవారి అరుపులూ మొదలైనవి కొంత చికాకు కలిగించాయి. ఏమయినాసరే! ఏడున్నరదాకా ఉండదలచుకున్నందున—అంతవరకూ వుండి, తర్వాత బయలుదేరి ఒక టాంగా చేయించుకుని చాందినీ చౌకు మార్గంగా స్టేషన్‌కు వచ్చాము. తర్వాత వంటవారు పెట్టిన అన్నంతో తృప్తిపడ్డాము. రైల్వే హోటలులోనూ,

ఇతరత్రా ఎక్కువ డబ్బు ఇచ్చినా భోజనం తృప్తికరంగా లేదనీ, మన కాంటీను భోజనంతో సమానంగా ఏ భోజనం ఉండదనీ—ఆయా స్థలాలలో భోజనం చేసినవారు తెలిపారు. అందువల్ల వారికంటే మేమే అదృష్టవంతులమని తోచింది.

తొమ్మిది గంటలయేసరికి అందరూ కారు చేరుకున్నారు. రాత్రి పదీ, పది నిమిషాలకు బయలుదేరే మసూరీ ఎక్స్‌ప్రెస్సునకు అది తగిలించబడింది. మా తర్వాతి మజిలీ హరిద్వారం. హరిద్వారం వెళ్లడానికి ఇదే అనుకూలమైన బండి. ఇది మసూరీ ఎక్స్‌ప్రెస్ ఐనా, అంతవరకూ వెళ్ళదు. డెహ్రాడూన్ వరకే వెళ్లుతుంది. అక్కడనుంచి మసూరీకి బస్సులో వెళ్ళాలి. డెహ్రాడూనునుంచి మసూరీకి రోడ్డున్నది. రైలురోడ్డు లేదు.

ఢిల్లీ స్టేషనులో మాకు తగిన సదుపాయాలు జరిగాయి. మా పెట్టెను ఎండలో ఏదో ఒక చివరకు తోసి వెయ్యకుండా నీడపట్టున—స్టేషను ప్రధాన కార్యాలయాలకు సమీపంలోనే ఉంచారు. చెప్పనక్కరలేకుండానే కారు శుభ్రంగా తుడిచి, పైభాగాన్ని బాగా కడిగి, టాంకులనిండా నీరు నింపారు. ఫానులూ అవీ పనిచెయ్యడంకోసం బ్యాటరీ చాలాసేపు ఛార్జి చెయ్యబడింది. తిరిగి హెచ్చరించనక్కర్లేకుండానే మా కారు ఎక్స్‌ప్రెస్సుకు తగిలించబడింది. సరియైన టైముకే బండీ బయలుదేరింది.

ఢిల్లీ దాటినతర్వాత వచ్చిన పెద్ద స్టేషను ఘూజియాబాదు. అక్కడివరకూ మా బండి తూర్పుగా ప్రయాణం చేసింది. ఘూజియాబాదు ఢిల్లీకి 13 మైళ్ల దూరంలో ఉన్నది. అక్కడినుంచి తూర్పుగా వెళ్లే రైలు మురాదాబాదు

చేరుతుంది. మా బండి ఈశాన్యముగాలగా ప్రయాణంచేసి రమారమి 12 గంటల రాత్రికి మీరట్ చేరింది. ఇది ఒక జంక్షను. ఇక్కడినుంచి ఒక లైను దక్షిణంగా పోయి, ఢిల్లీ — మురాదాబాదు మార్గంలో ఘాజియాబాదుకు ప్రక్కనున్న హాపూరును చేరుతుంది. ఆ తర్వాతి జంక్షను సహారాన్ పూరు. అక్కడికి మా బండి తెల్లవారుజామున మూడు గంటలకు వచ్చింది. ఇది అమృతసర్ — మొగల్ సరాయి మెయినులైనుపై వున్న స్టేషను. అమృతసరునుంచి ఇక్కడి దాకా జంటమార్గా లున్నవి. హరిద్వారం వెళ్ళడానికి మేము — ఇక్కడినుంచి — ఆగ్నేయముగాలగా — లక్సారు వరకూ ప్రయాణం చెయ్యాలి. లక్సారునుంచీ ఉత్తరంగా పదిహేడు మైళ్లు ప్రయాణంచేస్తే హరిద్వారం వస్తుంది. మా బండీ నాలుగున్నరకు లక్సారువచ్చి, అయిదుకు తిరిగీ బయలుదేరింది. మేము ఐదున్నరకల్లా హరిద్వారం చేరుకున్నాము.

# అపురూప దృశ్యాల హరిద్వారం

హిమాలయా పర్వతాలు మూడు వరుసలలో ఉన్నవి. అందులో ముందువరసలో ఉన్నవాటికి శివాలీ పర్వతాలని అంటారు. రెండో వరసలో ఉన్నవే చాలా ఎత్తయినవి. ఎవరెస్టు మున్నగు శిఖరా లీ వరుసలోనే ఉన్నవి. మూడవ వరుసలోనివి మొదటి వరుసలో ఉన్నవాటివలెనే కొంత తక్కువ ఎత్తుగలవి. హరిద్వారం శివాలీ పర్వతాల ప్రక్కనే వున్నది. కావున ఇక్కడ వర్షాలు తరుచుగా పడుతూ వుంటాయి. మేము స్టేషను చేరినవెంటనే పెద్ద జల్లు వచ్చి మాకు స్వాగతం యిచ్చింది. అందువల్ల మేము పావుగంట సేపు స్టేషనులోనే ఆగిపోవలసి వచ్చింది.

మేము స్టేషనులో బెంచీలమీద కూర్చుని మాట్లాడు కొంటూ వుండగా—ప్రక్క బెంచీమీద ఒకవ్యక్తి చంకలో గొడుగుతో కూర్చుని వున్నాడు. అతడు తెల్లని దుస్తులు, కాలికి బూట్సు ధరించి, తాంబూలచర్వణం చేసి వున్నాడు. దాక్షిణాత్యునివలె కనబడ్డాడు. మేం—ఎక్కడికి వెళ్ళడం, ఏలాగున వెళ్ళడం—అని ఆలోచించుకుంటూవుంటే తానే జోక్యం కలిగించుకొని—తనకన్నీ తెలుసుననీ, చెయ్యవలసిన విధులను సక్రమంగా జరిగేటట్లు ఏర్పాటు చేస్తాననీ చెప్పాడు. మేం తమిళం తెలుగు హిందీ భాషలలో మాట్లాడితే ఆ యా భాషల్లోనే సమాధానం ఇచ్చాడు. అతడు తీర్థపురోహితు డయి వుంటాడని ఊహించి అడుగగా—తాను పురోహితుడ

ననే చెప్పాడు. అతని వేషానికీ, వృత్తికీ ఏమీ సంబంధం లేకపోవడం మాకు చాలా ఆశ్చర్యాన్ని కలిగించినది.

పెద్ద క్షేత్రాల్లో తీర్థ పురోహితులు మొరటుతనానికి అలవాటుపడి వుంటారు. దూర ప్రదేశాలనుంచి వచ్చే యాత్రికులవద్ద ఎలా డబ్బు గుంజడమా అనేదే వారి ఆలోచన. ఆయా క్షేత్రాల్లో చేయవలసిన విధులను ఏకరువుపెట్టి అధమం ఏభై రూపాయాలకయినా ఖర్చు చూపిస్తారు. మనం కొంచెం వెనకతీస్తే "ఇంత దూరమూ వచ్చి, వెనకతీస్తే, వచ్చిన ప్రయోజనం ఏమిటి? ఇంకోసారి రాబోతారా, ఏమన్నానా?" అంటారు. తర్వాత బేరాల్లోకి దిగితే ఏభయి రూపాయిలుగా, అయిదు రూపాయిల్లోకి దిగడంకూడా వుంది. ఆ పురోహితుడు మమ్మల్ని నడిపిస్తూ ఈ ధోరణిలోనే మాట్లాడాడు.

"అయ్యా! మాకు దేశం చూడడం ప్రధానం. తీర్థ విధులు ముఖ్యం కాదు. ఇక్కడ గంగాస్నానం ముఖ్యం కాబట్టి సంకల్ప పూర్వకంగా స్నానం చెయ్యాలని కోరిక. మాకు తోచిన తృణమో, పణమో యిస్తాము. సమ్మతమైతే మాతో రండి. లేదా—మేమే సంకల్పం చెప్పుకుని స్నానం చేస్తాము" అనేసరికి మారుమాటాడకుండా—మమ్మల్ని అతను స్నాన ఘట్టానికి తీసుకు వెళ్ళాడు.

హరిద్వారంలో గంగా స్నాన ఘట్టం చాలా విచిత్రంగా ఉన్నది. నదిలో నడుమ విశాలమైన తిన్నె! అది చేరుకోవటానికి చిన్న వంతెన ఉన్నది, అక్కడ నదికి వడి ఎక్కువ. నీటిలో చెయ్యి పెడితే, మంచు ముట్టుకున్నట్లే ఉంటుంది. లోతుకు దిగడానికి వీలులేదు.

మూడు నాలుగు మెట్లవరకూ దిగి స్నానం చెయ్య

వచ్చు. మొదటిసారి మునగడమే కొంత కష్టం. తర్వాత చలి ఉండదు. గంగలో స్నానం ఒక విధమైన సంతృప్తి నిస్తుంది. అక్కడ గంగ కొన్ని భవనాలను ఒరసికొనే పారుతూవుంది. ఆ భవనాలుమాత్రం చెక్కు చెదరకుండా వుండడం ఆశ్చర్యకరం.

మమ్మల్ని అక్కడికి తీసుకువెళ్లిన పురోహితుడు నది సమీపంలో పువ్వులు, పసుపు, కుంకుమం, గంగకు పాత్రలూ మొదలైనవి కొనిపించి, ఆ తిన్నెమీదికి తీసుకువెళ్లాడు. మా గుడ్డలు మొదలైనవి ఒకచోట ఉంచి, అందరమూ స్నానానికి సిద్ధమయ్యాము. ఆయన కాలిజోళ్లుమాత్రం విప్పి, పక్కనే ఉంచుకుని సంకల్పం చెప్పి మమ్మల్ని మునగమన్నాడు. అక్కడి తంతు అరగంటలోగా ముగిసిపోయింది. మేము పరిశుద్ధమైన గంగాజలాన్ని, అందుకోసం—కొన్న చెంబులలో నింపుకొని, వాటికి మూతలు వేయించుకొని, పట్నం చూసుకుంటూ స్టేషనుకు చేరాము.

గంగను పాత్రలలో నింపుకొని సీలుచేసి తేవడం దేనికి? అని కొందరికి సందేహం కలుగవచ్చు. సాధారణంగా ఏ నీరయినా రెండు మూడు దినాలు ఉండేసరికి కంపుకొడుతుంది. పురుగులుపడుతుంది. గంగా జలంమాత్రం—ఎన్నేళ్లుంచినా పరిశుద్ధంగానే ఉంటుంది. అది పరమ పవిత్రము కాబట్టే నిలవ వుంటుందని మన ప్రాచీనుల నమ్మకం. అందువల్ల అందరూ గంగాజలాన్ని తీసుకువస్తారు. హరిద్వారం వెళ్లేవారు అక్కడే నీరు పట్టుకుంటారు. అంతదూరం వెళ్లలేక కేవలం ప్రయాగ దాకా వచ్చినవారు పరిశుద్ధమైన గంగాజలాన్ని అక్కడే పట్టుకుంటారు. కాశీలో

గంగమాత్రం అసలు గంగాజలం కాదు. ప్రయాగవద్ద గంగలో యమునానది కలుస్తుంది. యమున కలియక మునుపే గంగా జలాన్ని తీసుకోవాలి.

తీర్థ పురోహితులు, వారికి కమీషను ఇచ్చే దుకాణాలకే మనలను తీసుకువెళ్లడం పరిపాటి. అలా కాకుండా మనమే స్వయంగా వెళ్లితే—"తేడా" తప్పకుండా కనబడుతుంది. పాత్రల విషయంలో ఈ వ్యత్యాసం కనబడింది. అందువల్ల—వారివలన కావలసిన పనులను మాత్రం తీర్థ పురోహితులపైన ఆధారపడి, బేరసారాలలో స్వబుద్ధిని వినియోగించడం ఎంతైనా మంచిది.

భోజనానంతరం కొందరు విశ్రమించారు. హరిద్వారంలో గంగా స్నానమే ముఖ్యమనీ, దానితో అక్కడి పని పూర్తి అయిందనీ చాలామంది తలంపు. సాయంకాలం వూరు తిరగాలని మాత్రం వారు అనుకొన్నారు. కాని, కొందరికి అక్కడి విశేషాలు చూడాలనే అభిలాష ఉన్నది. అభిలాష వున్న కొందరం భోజనానంతరం స్టేషనులో బెంచీలమీద కూర్చున్నాం. మాకు ఎదురుగా ఎత్తుగా ఒక పర్వతం, దాని మీద ఒక గుడీ కానవచ్చాయి. మాకు సమీపంగా కూర్చున్న ఒక సన్యాసిని "ఆ గుడిలోని దేవత ఎవరు? అక్కడికి వెళ్లడం సులభమేనా?" అని అడిగాము. అతడు దాక్షిణాత్యుడు. అతడు అరవంలోనే సమాధాన మిచ్చాడు. అది మనసాదేవి దేవాలయమనీ, అక్కడకు ఎక్కి వెళ్లడం ఏమంత కష్టంకాదనీ,అక్కడినుంచిచూస్తే పరిసర ప్రదేశాలు ఎన్నో స్పష్టంగా కానవస్తాయనీ, కావలిస్తే తాను దారి చూపుతాననీ అన్నాడు. వెంటనే నలుగు రైదుగురం బయలు

చేరాము. అరమైలు దూరం రైలురోడ్డు ప్రక్కనే నడిచి పోగా ఒక టన్నెల్ వచ్చింది. దాని ప్రక్కనుంచే కొండ మీదికి చిన్నదారి ఉన్నది. మెట్లులేవు. గులకరాళ్లు ఎక్కువ. అడుగు వేస్తే జారుతున్నది. నిటారుగా ఎక్కవలసి ఉన్నది. కొండ లెక్కే అలవాటు లేనివారికి చాలా శ్రమ అనిపిస్తుంది. అందువల్ల సగందూరం వచ్చి, అక్కడ ఇద్దరుమిత్రులు నిలిచి పోయారు. ఆ సన్యాసి ముందు దారి చూపగా నేనూ, శ్రీ అహోబిలం, శ్రీ శాస్త్రిగారున్నూ మీదికి ఎక్కాము.

ఎండలో కొండ ఎక్కడంవల్ల దాహం వేసింది. దేవాలయందగ్గర యాత్రికులకు మంచినీటిని సరఫరా చేసే ఏర్పాటున్నది. కొండలో ఒక చోట మంచి నీరు దొరుకుతుందనీ, అక్కడికి వెళ్ళడానికి కొండ సగం దిగాలనీ, అక్కడినుంచే పూజకూ, యాత్రికులకూ నీరు తేబడుతూ ఉంటుందనీ తెలిసింది.

కొండమీదనుంచి చూస్తే పరిసర ప్రదేశాలు ఎన్నో కానవస్తాయి. మనసాదేవి దర్శనం చేసుకుని, ఆ తర్వాత అనుకూలమైన స్థలంనుంచి దృశ్యాలు చూచాము. మనసా దేవికి మూడు తలలూ, అయిదు చేతులూ ఉన్నవి. ఎనిమిది చేతులున్న భైరవుని విగ్రహం గల దేవాలయం ఆ సమీపం లోనే ఉన్నదని సన్యాసి చెప్పినాడు.

ఆ పర్వతంమీదనుంచి చూస్తే ప్రక్కనే ప్రవహిస్తున్న గంగానదీ, దానికీ, కొండకూ మధ్యనున్న హరిద్వారం, నది కావల పర్వత పంక్తులూ, ఒక కొండపై దేవాలయమూ కానవచ్చాయి. అక్కడికి వెళ్లాలంటే గంగను బ్రిడ్జి మూలంగా దాటాలి. కొండమీదికి ఎక్కి తిరిగి వచ్చేమార్గం

ఏడెనిమిది మైళ్లు వుంటుంది. ఉదయాన్నే అక్కడికి వెళ్ళితే ఎండపడకుండా తిరిగిరావచ్చును, వెళ్లేటప్పుడు ఫలాహారాలూ, తాగడానికి నీరూ తీసుకుని వెళ్లాలి. లేకపోతే చాలా శ్రమపడవలసి వస్తుందట! ఆ కొండమీద చండీదేవి దేవాలయం ఉన్నది. దాన్ని 1856 లో కాశ్మీరు మహారాజు శ్రీ సర్ జిత్ సింగుగారు కట్టించారు.

పర్వతాగ్రభాగంనుంచి చూస్తూంపుంటే గంగానది యొక్క పెక్కు శాఖలు కానవచ్చాయి. వాటినిగురించీ, పర్వత ప్రాంతంలో సమీపంగా వున్న నగరాలనుగురించీ ఆ సన్యాసి వివరంగా తెలియజేశాడు. తర్వాత మేము క్రిందికి దిగాము. మధ్యలో స్నేహితులు కలుసుకున్నారు. అందరమూ కలిసి గంగాతీరానికి వెళ్ళి, ఆ సమీపంలోఉన్న ఒక దక్షిణాది హోటలులో కాఫీ తీసుకున్నాము. మరొకసారి గంగాస్నానం చేశాము. పిదప అక్కడి విశేషాలన్నీ చూశాము.

కాశీలో గంగానదికి చాలా ఘట్టాలు ఉన్నట్లే హరిద్వారంలో కూడా చాలా ఘట్టాలున్నాయి. వాటిలో సుభాష్ ఘాటు, గోఘాటు, కుశావర్తఘాటు పేరుపడినవి. సుభాష్ ఘాటువద్ద శ్రీ సుభాష్‌చంద్రబోసు విగ్రహం స్థాపితమైవున్నది.

హరిద్వారానికి మాయాపురి అనే పేరు ప్రసిద్ధం. ఇక్కడ మాయాదేవి దేవాలయం ఒకటి ప్రాచీనమైనది ఉన్నది. దాన్నిబట్టి దీనికి మాయాపురి అనే పేరు వచ్చిందట. ఆ దేవాలయం పన్నెండో శతాబ్దంనాటిదని చెబుతారు. ఇక్కడ శివ, కేశవు లిద్దరికీ చాలా దేవాలయాలున్నాయి. అన్నింటినీ చూడడం మాకున్న స్వల్పకాలంలో సాధ్యం కాలేదు. కాబట్టి కొన్నేచూచాము. సమీపంలోని కాంగ్రి

గురుకులాశ్రమం సుప్రసిద్ధమైనది. అక్కడికి వెళ్ళడానికి ఒక పూటన్నా పడుతుంది. కాబట్టి దాన్ని చూడటం సాధ్య పడ లేదు.

ముఖ్యమైన దేవాలయాల నన్నింటినీ చూచి మేము బజారువీధికి వెళ్లాము. హరిద్వారం చిన్నపట్టణమే అయినా, అన్ని వస్తువులూ దొరుకుతాయి. తక్కిన వూళ్లలోకంటె కొంత సరసమైన వెలలకే ఉన్నిబట్టలూ, పండ్లూ మొదలైనవి లభిస్తాయి. కావలసినవాటిని కొని, మేము ఏడున్నరకల్లా స్టేషనుకు వెళ్లాం.

స్టేషన్ భవనానికి ముందుగా రోడ్ల మధ్య ఒక శిలా విగ్రహం ప్రతిష్ఠించబడింది. అది మృత్యుంజయుని విగ్రహం. అంటే శివుని విగ్రహం. సామాన్యంగా వ్యక్తుల విగ్రహాలను ఇలాంటి స్థలాల్లో వుంచడం కద్దు. ఇక్కడ దేవతా విగ్రహాన్ని ఉంచడం వింతగానే తోచింది. అక్కడినుండి కుడిచేతితట్టు పోయే రోడ్డు జ్వాలాపురం, కాంగ్రి గురుకులాశ్రమం మొదలైన చోట్లకు వెళుతుంది. ఎడమచేతి వైపు రోడ్డు హరిద్వారం రోడ్డు. అది హరిద్వారం మీదుగా హృషికేశం మొదలైన చోట్లకు వెళ్లుతుంది.

మాకు మార్గదర్శకుడుగా ఉంటూ వచ్చిన సన్యాసి కారుదాకా వచ్చినాడు. అతనికి కొంత పారితోషికం ఇచ్చి, మా లీడరుగారి అనుమతితీసుకుని భోజనంకూడా పెట్టించాము. అతడు ఎంతో తృప్తిపడి వెళ్లినాడు. భోజనాలు చేశాక స్టేషన్ ప్లాట్‌ఫారముమీదా, వెయిటింగ్ రూములలోనూ పడు కున్నాము. మళ్లీ ప్రయాణం ఉదయంఏడుంబావునకు, అందువల్ల అందరూ హాయిగా నిద్రపోవడానికి అవకాశం కలిగింది.

సెప్టెంబరు 25 వ తేదీ. తెల్లవారుజామునే లేచి అవసరాలు తీర్చుకుని కాఫీ, ఫలాహారాలు ముగించుకునేసరికి మా పెట్టె హరిద్వార్—ఋషీకేశ్ ప్యాసింజరుకు కట్టబడింది. సరిగా ఏడుం బావయేసరికి బండీ బయలుదేరింది. ఆకాశం మేఘావృతమై చిన్నజల్లు పడసాగింది. వాతావరణం చల్లగా ప్రశాంతంగా ఉండి, ఆరుగంటలయినట్లుగా మాకు తోచలేదు.

బండీ స్టేషనునుంచి బయలుదేరిన కొద్ది సేపటిలోనే కొండకింది మార్గంలో ప్రయాణం చెయ్యవలసివచ్చింది. మరి కొద్ది నిమిషాలలోనే మరొక టన్నలులో ప్రయాణం చెయ్య వలసివచ్చింది. ఈ రెండూ హరిద్వారంలోనివే. పట్టణ ప్రాంతంలోనే యిలా మార్గం వుండడం చాలా చిత్రంగా తోచింది.

హరిద్వారానికి హృషీకేశం పధ్నాలుగు మైళ్ళున్నది. ఆ తర్వాత రైలుమార్గం లేదు. ఈ మధ్యలో మాకు కనబడినవి కొండలూ, అడవులూ, చిన్నచిన్న నదులూ మొదలైన దృశ్యాలు! హరిద్వారంనుంచి ఏడు మైళ్లు ప్రయాణం చెయ్యగానే రాయ్‌వాలా జంక్షన్ వచ్చింది. అది ప్రధాన స్థలం కాదు. అక్కడ ప్యాసింజెర్ రెండు నిమిషాలే ఆగింది. డెహ్రాడూనుకు వెళ్లేబండి అక్కడ లైను మారుతుంది. అక్కడినుండి డెహ్రాడూన్ పాతిక మైళ్లు. కొండల మీదనుంచి ప్రయాణం. మేము మా ప్రోగ్రాములో డెహ్రాడూన్ చేర్చలేదు. అందువల్ల ఆ లైనులో ప్రయాణంచేసే అవకాశం లేకపోయింది.

# ఋషి నివాసమైన హృషీకేశం

మేము హృషీకేశం చేరేసరికి ఎనిమిదింపావయింది. వెంటనే కావలసిన కొన్ని బట్టలుమాత్రం పట్టుకొని స్వామీ శివానందగారి ఆశ్రమానికి బయలుదేరాము. మేము ఇలా వస్తున్నామని అక్కడి అధికారులకు ముందుగానే తెలియజేసి ఉన్నాము. వారు మాకు భోజనసౌకర్యం కలిగిస్తామన్నారు. ఆ ఆశ్రమం గంగానది ఒడ్డునే ఉన్నది. కాని స్టేషనుకు రమారమి మూడు మైళ్లున్నట్లు తోచింది. దారిలో అందరినీ భోగట్టా చేసుకుంటూ, ఎలాగైతేనేం రమారమి తొమ్మిది గంటలకు ఆశ్రమం చేరుకున్నాం. అలా వెళ్లుతూవున్నప్పుడు దారిలోనే ఆంధ్రాశ్రమం తగిలింది. కాని వేళ లేనందునా, ఇతరుల జట్టులో వున్నందునా, కోరికవున్నా ఆ ఆశ్రమంలోకి నేను పోలేకపోయాను.

మేము మొదట ఆఫీసుకువెళ్లి వాకబు చేయగా— మా రాకనుగూర్చి తెలుసుననీ, వంటలుచేసి సిద్ధంగావుంచామనీ, శ్రీ స్వామీజీ ఆశ్రమంలోనే ఉన్నారనీ, ముందు వారి దర్శనం చేసుకొని, తర్వాత స్నానాదులు నిర్వర్తించుకుని భోజనంచెయ్యవచ్చుననీ అక్కడి ఉద్యోగులు చెప్పారు. వెంటనే మేము శ్రీ స్వామిజీ ఉన్నచోటుకు వెళ్లాము. మమ్మల్ని చూచి ఆయన గదినుండి బయటికి వచ్చి మా వందనాలను స్వీకరించి అరవంలోనే మాటలాడారు. ఛాయా చిత్రాన్ని గ్రహించడానికి మనఃపూర్వకంగా అనుమతించారు. కొన్ని

వేదాంత పుస్తకాలూ, భగవద్గీతకు ఆంగ్లంలో వ్రాసిన వ్యాఖ్యా, కొన్ని తెలుగు—తమిళ పుస్తకాలూ, కరపత్రాలూ మాకు ఇవ్వడానికి తెప్పించారు. ఆయన ఇయ్యదలచిన ప్రతులు కొద్దిగా ఉన్నవి. పండ్ల గంపమీద పడినట్లు ఆ పుస్తకాలకోసం స్వామిజీమీద పడసాగారు జనాలు. ఈ ధోరణి చూచి స్వామిజీ ఏమనుకుంటారో అని నాకు సిగ్గని పించినది. కొందరికి మాత్రం పుస్తకాలు లభించాయి. విశేషం ఏమిటంటే—భగవద్గీత అంటే ఏమిటో—అసలు వేదాంతమంటే ఏమిటో తెలియని వారికీ—అక్కర్లేనివారికీ ఆ పుస్తకాలు లభించాయి. వాటిమీద ఆసక్తి వున్నవారికి లభించ లేదు. లోకంలో జరిగే పద్ధతే యిది! కనుక ఆశ్చర్యం ఏనికి? మిక్కిలి ఉపయుక్తమైన పుస్తకాలమీద ఆసక్తి వున్నా డబ్బిచ్చి కొనుక్కోలేక బీదలు అవస్థపడుతూవుంటే—పెద్ద పెద్దవారికి బహూకరింపబడిన ఆ గ్రంథాల మేలురకపు ప్రతులు మరునాడే ప్రాతపుస్తకాల అంగళ్ళలో ప్రత్యక్షం కావడం నేను బాగా ఎరుగుదును.

తర్వాత స్వామీజీ 'స్నానాలుచేసి భోజనం చెయ్యండి' డని మాతో చెప్పి వెళ్లిపోయారు. ఆశ్రమం పక్కనే ఉన్న గంగానదిలో మేము తృప్తితీరా స్నానంచేశాము. అక్కడి స్నానఘట్టాలు చాలా అనుకూలంగా ఉన్నవి. గంగకు వడి ఎక్కువగా ఉన్నా ప్రమాదం ఏమీ లేదు.

మేము స్నానంచేసి, భోజనాలు ముగించుకునేసరికి పదకొండు గంటలకుపైగా అయింది. భోజనం రెండు బ్యాచు లలో చెయ్యవలసి వచ్చింది. మాకంటె ముందుగా కొందరు అతిథులు భోజనం చేశారు. అక్కడి ఏర్పాట్లనుబట్టి చూస్తే

దినమూ రెండు వందలమంది భోజనం చేస్తూవున్నట్లు కాన వస్తుంది. కొంతమందికి బసలుకూడా అక్కడే! అందులో సన్యాసులు చాలామంది వున్నారు.

భోజనానికి మేము కూర్చోగానే ఆకులు వేశారు. వెంటనే హాలు తలుపులు మూసివేశారు. కారణం ఏమంటే కోతులు లోపల ప్రవేశించి నానా హంగామా చేస్తాయట. అక్కడి భోజనం ఒకమాదిరి దక్షిణాది సంప్రదాయంలోనే ఉన్నది. భోజనాలు చేసేసరికి మా బట్టలు ఆరినాయి. పన్నెండు గంటలకు మేము బయలుదేరాము. బయలుదేరే ముందు మా పార్టీ తరఫున ఆశ్రమానికి కొంత సొమ్ము సమర్పించాము.

శ్రీ శివానందస్వామివారి ఆశ్రమానికి ఎదురుగా— గంగకు అవతలి తీరాన చాలా భవనాలు ఉన్నవి. హృషీకేశంలో ముఖ్యంగా చూడవలసినవి అవేనట. అక్కడికి వెళ్లాలంటే గంగను దాటాలి. అక్కడ కొన్ని పడవలు ఇద్దరి నుంచి అద్దరికి మనుష్యులను దాటవేస్తూ వుంటాయి. దానికి ఏమీ సుంకం లేదు.

ఆశ్రమానికి ఎదురుగానే వున్న గంగకు వడి ఎక్కువ కావటంవల్ల మేము రెండు ఫర్లాంగులు ఎగువకుపోయి పడవ కోసం ఎదురుచూస్తూ నుంచున్నాము. ఇంతలో అద్దరినుంచి ప్రయాణీకులను తీసుకుని పడవ వచ్చింది. అది నలభై మంది కంటె యెక్కువ ప్రయాణం చెయ్యడానికి తగదు. ఇతరులతో కలిసి మేము రమారమి అరవై మందిమి ఉన్నాము. మమ్మల్ని అందరినీ ఒకేసారి తీసుకువెళతామని పడవవారు అన్నారు. ప్రమాదం కలుగుతుందనే సందేహంచేతనో ఏమో

మాలో నలుగు రైదుగురు ప్రయాణానికి నీళ్ళిపోతామన్నారు. తక్కినవారమంతా ధైర్యంతో పడవ యెక్కాము. పడవ ప్రవాహవేగానికి ఇటూ, అటూ కదిలినప్పుడు మా కందరికి భయం కలిగింది. కాని, ఎట్టి ప్రమాదానికీ గురికాకుండా అందరమూ అవతలి ఒడ్డు చేరాము.

మేము చేరినచోటు సరిగ్గా శివానందస్వామి ఆశ్రమానికి ఎదురుగానే వున్నది.

ఘట్టంలో దిగి మెట్లు ఎక్కగానే స్వర్గాశ్రమం కానవచ్చింది. దాన్ని బాబా కాలీకంబళీవాలా అనే స్వామి స్థాపించేరట, అక్కడ తపస్సు చేసుకునే సాధువులూ, సన్యాసులూ నివసిస్తూ వుంటారు. వారికి కావలసిన భోజన, వస్త్ర సదుపాయం ఆశ్రమాధికారులే ఉచితంగా చేస్తారు. కేవు లేకుండా పడవలను నడిపించేది కూడా ఆ ఆశ్రమాధికారులే!

స్వర్గాశ్రమానికి పక్కనే వున్నది గీతాభవనం. దీనిని గోరఖ్‌పూరునందలి గీతాముద్రణాలయాధికారులు నిర్మించారు. దీని గోడల నిండుగా భగవద్గీతకు సంబంధించిన త్రివర్ణ చిత్రాలూ, వానికి సంబంధించిన శ్లోకాలూ చిత్రించబడి ఉన్నవి. ఈ భవనం రెండవ అంతస్తులో గీతా లైబ్రరీ అనే పుస్తక భాండాగారం ఉన్నది. ప్రతి సంవత్సరమూ వేసవిలో ఇక్కడ సామూహికంగా ప్రార్థనలు జరుగుతూ వుంటాయి. ఆ ప్రార్థనలలో వేలకొలదీ జనులు పాల్గొంటూ వుంటారట. గీతాభవనానికీ, స్వర్గాశ్రమానికీ సమీపంగానే "పరమార్థ నికేతనం" వున్నది. ఇదీ తత్త్వజిజ్ఞాసకు ఉద్దేశింపబడిన స్థలం. దీని ద్వారంలో శ్రీ మహావిష్ణువు విగ్రహం ప్రతిష్ఠితమైవున్నది. దానికి చెరియొక వైపునా హనుమంతునియొక్క, గరుడుని

యొక్క విగ్రహాలు ఉన్నవి.

ఆ మందిరాన్ని చూచాక మేము లక్ష్మణఝూలా వద్దకు బయలుదేరాము. అది హృషీకేశానికి ఎగువగా రెండు మైళ్ళ దూరాన ఉన్నది అక్కడ గంగానదికి ఈ ఒడ్డునుంచి ఆ ఒడ్డునకు మధ్యను స్తంభాలు లేకుండా ఇనుప వంతెన వున్నది. అక్కడ కొండల మధ్యనుంచి గంగానది ప్రవహించడంవల్ల చాలా ఇరుకుగాను, లోతుగాను ఉన్నది. అక్కడి ప్రకృతిశోభ చూడవలసిందే కాని వర్ణించ సాధ్యంకాదు. రెండుమైళ్ళ దూరం నడిచినా నడిచినట్లే అనిపించలేదు. కేదారేశ్వరానికీ, బదరీనారాయణానికీ ఈ మార్గంమీదుగానే వెళ్ళాలి.

లక్ష్మణ ఝూలానుంచి రమారమి అరమైలు దిగువకు రాగా టాంగాలూ, బస్సులూ దొరుకుతాయి. మేము వచ్చేసరికి అక్కడ మూడు టాంగాలే ఉన్నవి. ఒకదాన్ని ఇతరులెవ్వరో కుదుర్చుకున్నారు. మేము రెండు టాంగాలను మాట్లాడుకుని ఎనమండుగురం హృషీకేశం వూళ్లోకి బయలుదేరాము. తక్కినవారు బస్సుకోసం కాచుకున్నారు.

మా టాంగాలు హృషీకేశం పట్నంలోకి వచ్చేసరికి బస్సు కూడా వచ్చింది. మా జట్టులోని వారందరూ అందులోంచి దిగారు. మే మందరమూ కలిసి ఆ సమీపంలోనే వున్న భరతుని దేవాలయం చూచాము. సాధారణంగా భరతుడికి దేవాలయం వున్నట్లు ఎక్కడా వినలేదు. ఇక్కడ ఇదొక విశేషం. శ్రీరామచంద్రుని సోదరుడైన భరతుని విగ్రహం ఇక్కడ పూజింపబడుతున్నది.

అక్కడి అంగడివీధికి చివర త్రివేణికుండం అనేది

వున్నది. అందులోకి కొండలమీదినుంచి వచ్చే మూడు ప్రవాహాల నీరు వచ్చి పడుతుంది. వేణి అంటే ప్రవాహంకదా! మూడు ప్రవాహాలూ పడడంవల్ల దానికి త్రివేణి కుండమనే పేరు వచ్చింది. ఆ మూడు ప్రవాహాలూ గంగా, యమునా, సరస్వతులనుంచి వచ్చినట్లుగా ప్రజలు భావిస్తారు. ఈ త్రివేణి కుండానికే కుబ్జామ్రకమనే నామాంతరమున్నూ వున్నదట.

ఇవన్నీ చూచుకుని మేము స్టేషనుకు వచ్చాము. కొందరు కార్డులూ, కవర్లూ కొని జాబులు వ్రాయడానికి పోస్టాఫీసుకు వెళ్లారు. అప్పటికి నాలుగు గంటలైనందున మేము కాఫీ, ఫలాహారాలు తీసుకుని ప్లాట్‌ఫారంమీది చెట్లనీడల్లో విశ్రాంతి తీసుకున్నాం.

హృషీకేశం చిన్న స్టేషను. అక్కడ మా కారులోని టాంకులు నింపుకోడానికి నీటిసౌకర్యం లేదు. బాటరీ చార్జి చెయ్యడానికి అవకాశమూ లేదు. వాటిని గురించి స్టేషను మాస్టరుకు చెపితే "అవన్నీ హరిద్వారంలో జరగవలసినవే" అని జబాబిచ్చాడు. అయోమార్గపు చివరి స్థలంలో ఇట్టి సౌకర్యాలు కలిగించడం ఎంతైనా అవసరం. మరి రైల్వే అధికారులు ఎందుకోసం ఉపేక్షించారో తెలియదు.

తర్వాత మేము వెళ్ళవలసిన చోటు ప్రయాగ—అనగా అలహాబాదు. అక్కడికి వెళ్లాలుంటే హృషీకేశంనుంచి వెనుకకు లక్సారుదాకా వచ్చి ఆగ్నేయమూలగా ప్రయాణం చెయ్యాలి. రమారమీ 24 గంటలలో అలహాబాదు చేరగలుగుతాము.

# అక్కడినుంచి అలహాబాదుకు

సాయంకాలం ఏడుకు బయలుదేరే హరిద్వారం ప్యాసింజెరుకు మా కారు కట్టబడింది. ఆ బండి ఎనిమిది గంటలకు హరిద్వారం చేరింది. అక్కడ మా కారును డెహ్రాడూను —కలకత్తా ఎక్స్‌ప్రెస్సుకు తగిలించాలి. ఆ బండీ రావడానికి కొంత టయిమున్నది. ఈలోగా టాంకులకు నీరు పెట్టాలనీ, బేటరీ చార్జి చెయ్యాలనీ మా లీడరు స్టేషనుమాస్టరుకు తెలియజేశాడు. నీటి సప్లయి జరిగింది. కాని, బాటరీ ఛార్జి చెయ్యడానికి టైము లేదన్నాడు. అప్పటికే లైట్లు క్రమక్రమంగా క్షీణించిపోయాయి. హరిద్వారంనుంచి బండీ బయలుదేరేసరికి తొమ్మిదిమ్ముప్పావు అయింది. అప్పటికి లైట్లు పూర్తిగా ఆరిపోయాయి. మేము భోజనాలు చెయ్యలేదు. ఫానులు తిరగకపోతే పోనీ, లైట్లు లేకుండా భోజనం చెయ్యడం ఎలా సాధ్యపడుతుంది? నలుగు రైదుగురి దగ్గర టార్చిలైట్లున్నవి. కాని అంతమాత్రాన ప్రయోజనం ఏమిటి? ప్రయాణంలోని అసౌకర్యాలు మాకు మరొకమాటు అనుభవానికి వచ్చాయి. ఒకటే కారుచీకటి!

అలాటి సమయంలో తమవద్ద కొవ్వొత్తులున్నాయని ఇద్దరు ఇచ్చారు. వంటవారు రెండు చిన్న పళ్లేలలో నూనె పోసి, గుడ్డవత్తులు వేసి వెలిగించారు. అందరూ శీఘ్రంగా భోజనం చెయ్యడానికి అనుకూలంగా పులుసు అన్నం, పెరుగన్నం కలిపి వడ్డించాలని మా లీడరుగారు వంటవారికి సలహా

యివ్వగా, వారు అలాగే చేశారు. అందువల్ల భోజనాల తంతు వేగంగానే జరిగిపోయింది. నాటి రాత్రి ప్రయాణం యుద్ధసమయపు ప్రయాణాన్ని తలపునకు తెచ్చింది. ఆ కాలంలో బండ్లలో లైట్లు లేకపోవడమే కాదు, దొడ్లలో నీళ్లూ వుండేవి కావు. దూరప్రయాణం చేసేవారికి నరకలోకం ప్రత్యక్షమయ్యేది. నిలవడానికి జాగా దొరకడమే కష్టం. ఆ సమయంలో ఏ వస్తువులు పోయినా తెలియదు. అదృష్ట వశాత్తూ మాది టూరిస్టు కారు కావడంవల్ల ఆ చిక్కు లేమీ కలగలేదు.

మా బండి లక్సారు జంక్షను విడిచేసరికి రమారమి పదకొండు గంటలయింది. తర్వాత అరగంటకు వజీరాబాదు జంక్షను వచ్చింది. అక్కడినుంచి కోట్ ద్వారా అనే చోటుకు ఒక బ్రాంచి లైను ఉన్నది. మా బండి అక్కడ పదినిమిషా లాగింది. లైట్లు లేని ఆ అంధకారస్థితిలోనే కొందరు మేలొక్కని చేతికర్రల బేరానికి సిద్ధపడ్డారు. కర్ర లమ్మేవాడు మంచివి ఎంచుకోమని మూడింటిని ఇచ్చాడట. ఒక్కటే గ్రహింపబడింది. రెండింటికి బదులుగా ఒకటే తిరిగి ఇచ్చివెయ్యబడింది. ఇంకొకటి లోపల ఉండిపోయిందని వర్తకుడూ, లేదని మా పార్టీమనిషీ ఒకరికి తెలియనిభాషలో ఇంకొకరు వాదులాడారు. కొంచెం హిందీ తెలిసిన ఒక వ్యక్తి "మేము అన్యాయం చెయ్య"మని అరిచి చెప్పాడు. అమ్మే వాడు విస్తుపోయాడు. పెట్టె చూసుకోమన్నారు. తర్వాత ఒకరు అగ్గిపుల్ల వెలిగించి చూడగా – ఆ కర్ర బల్లకింద దాగు కొని ఉన్నది. దాన్ని తీసుకుని, అమ్మేవాడు వెళ్ళిపోయాడు. అందరూ విరగబడి నవ్వారు. దీపం లేని ప్రమాదం ఈ

విధంగా దాఖలా యిచ్చింది.

తర్వాత మాకు బాగా నిద్రపట్టింది. ఒకసారి తెలివి వచ్చి చూసేసరికి లైట్లన్నీ వెలుగుతూ వున్నవి. అదేదో యింద్రజాలంలాగా తోచింది. తర్వాత కనుక్కుంటే తెలిసింది—అదేమీ యింద్రజాలం కాదు. మా బండీ మురాదాబాదు వచ్చేసరికి మా లీడరు స్టేషనుమాస్టరుతో మాట్లాడి తాత్కాలికంగా అయినా లైట్లు వెలిగే ఏర్పాటు చెయ్యాలని కోరాడట. అక్కడ బండీ అరగంటసేపు ఆగుతుంది. ఒక మెకానిక్కు వచ్చి పెట్టె క్రిందిభాగంలోని డయనమో పరీక్షించి బెల్టు గడి తప్పడంవల్ల కరెంటు సప్లయికాలేదని దానిని ఒక నిమిషంలో సరిచేసినాడట. అందువల్ల లైట్లు వెంటనే వెలిగాయి. మాకు ఎదురుగా 'మురాదాబాద్' అని బోర్డు కానవచ్చింది. అప్పటికి రెండు గంటలు దాటింది.

మురాదాబాదు పెద్ద జంక్షను. అక్కడనుంచి ఒక లైను పడమరగా ఢిల్లీకి వెళ్తుంది. మరొకలైను దక్షిణంగా చందౌసీమీదుగా ఆలీఘరుకు పోయి, ఆ పైని టూండ్లాకు పోతుంది. మరొకటి చందౌసీమీదుగా పోయి—మెయిను లైనులోని బారైలీదగ్గర కలుస్తుంది. మెయినులైనులో మురాదాబాదు తర్వాతి పెద్ద స్టేషనే బారైలీ. ఇక్కడికి వచ్చేసరికి నాలుగు గంటలైనది. ఇక్కడినుంచి చందౌసీకి ఒక లైను పోతుందని యిదివరకే తెలుసును. అంతేకాక ఇది ఈశాన్య—రైల్వేకుకూడా ముఖ్యస్థలం. ఆ రైల్వేయొక్క చిన్నలైను ఒకటి ఉత్తరంగా భోజీపురా వెళుతుంది. మరొకటి నైఋతి మూలగా హత్రాస్ మీదుగా మధురకు వస్తుంది. ఈ స్టేషనులో మా బండి పది నిమిషాలపాటు ఆగి తిరిగి

బయలు దేరింది.

ఆ తర్వాతి స్టేషను షాజహాన్ పూరు. ఇక్కడికి మా బండీ అయిదుగంటలకు వచ్చి పది నిమిషాలు ఆగింది. ఇక్కడి నుంచి సీతాపూరు సిటీకి ఒక బ్రాంచి లైనున్నది. అది అక్కడినుంచి బాలామావు అనేచోట మెయిను లైనులో కలుస్తుంది. బాలామావు షాజహాన్ పూరు తర్వాతి పెద్ద స్టేషను. షాజహాన్ పూరు ఈశాన్య రైల్వేవారి చిన్న మార్గానికీ ముఖ్యస్థానమే. ఇక్కడినుంచి ఒక లైను ఉత్తరంగా పిలిభిట్ కు పోతుంది.

తర్వాత ఉదయం ఏడుగంటలకు బాలామావు జంక్షనుకు వచ్చాము. అప్పటికి అవసరాలు నిర్వర్తించుకుని ఫలాహారాదులు ముగించాము. స్నానానికి తగినంత నీరు ట్యాంకులలో వున్నట్లు లేదు. బండీ ఎక్కువసేపు ఆగిన స్టేషనులో స్నానంచేయడమే మేలని మాకు తోచింది. బాలామావు పెద్ద జంక్షనే. ఇక్కడినుంచి సీతాపూరు వెళ్ళేలైనే కాకుండా, నైఋతిదిశగా మధోగంజికి ఒక మార్గం పోతూవున్నది. ఇక్కడ మా ఎక్స్ప్రెస్ బండి మూడు నిమిషాలు మాత్రమే ఆగింది. పిదప ఎనిమిదిన్నరకల్లా మేము లక్నో జంక్షను చేరుకున్నాము.

ఉత్తర—రైల్వేలో లక్నో ముఖ్యమైన స్థలం. దీన్నే లక్ష్మణపురి అనీ అంటారు. ఇక్కడినుంచి చాలచోట్లకు మార్గా లున్నవి. కాన్పూరుకు ఇక్కడినుండి దగ్గరదారి వున్నది. మరొక లైను రాయ్—బారైలీమీదుగా అలహాబాదు పోతుంది. ఇంకొకటి సుల్తాన్ పూరు మీదుగా కాశీ, మొగల్ సరాయ్ జంక్షనులకు వెళుతుంది. వేరొకటి ఫైజా

బాద్ మీదుగా మొగల్ సరాయికి పోతుంది. ఈశాన్య—రైల్వేవారి చిన్న లైనొకటి ఇక్కడినుంచి సీతాపూరు సిటీకి వెళ్లుతుంది. ఇన్ని చోట్లకు మార్గాలున్నందువల్ల ఇక్కడ మా బండీ అరగంట కాలం ఆగింది. అందువల్ల కొందరం—అంటే స్నానాలకు సిద్ధంగా వున్నవాళ్లము—స్టేషనులో—వెయిటింగు రూములకు వెనుకనున్న స్నానాలగదులకు పోయి హాయిగా స్నానం చేసుకున్నాము. లక్నో స్టేషనుకు తగినట్లుగానే సౌకర్యాలూ వున్నవి.

ఉత్తరప్రదేశ రాష్ట్రంలోని పట్నాలలో లక్నో పేరు పడింది. ఆ ప్రాంతాలవారు దీన్ని "ఇండియన్ ప్యారిస్" అని వ్యవహరిస్తారు. అనుక్షణమూ మారుతూవుండే నాగరికతకు ఇది కేంద్రమట. ఉత్తరప్రదేశ రాష్ట్రమునకు ఇది ముఖ్యపట్టణం. గవర్నరు నివాసం ఇక్కడనే! ఎగువ, దిగువ శాసనసభలు కూడేదీ, మంత్రులు వుండేదీ యిక్కడనే. అయితేనేం? మా ప్రోగ్రాములో లక్నో చేరలేదు. అందువల్ల అక్కడ దిగి వూరు చూడడానికి అవకాశం లేకపోయింది.

పిదప మరొక అరగంటలోగానే బారాబంకికి వచ్చాము. ఇదొక చిన్నజంక్షను. ఇక్కడినుంచి సీతాపూరునకు ఈశాన్య రైల్వేవారి చిన్నలైను ఉన్నది. తర్వాతి పెద్ద స్టేషనే ఫైజాబాదు. అక్కడికి వచ్చేసరికి పదకొండున్నర గంటలయినది. మేము అలహాబాదు వెళ్ళడానికి అక్కడే లైను మారాలి. అందువల్ల ఆ స్టేషను రాగానే మా పెట్టెను డూన్ ఎక్స్‌ప్రెస్‌నుంచి విడదీశారు. తిరిగి మేము, అక్కడి నుండి ఒంటిగంటకు బయలుదేరే అయోధ్యా—అలహాబాదు ప్యాసెంజరులో వెళ్ళవలసివున్నది.

బండీ ఫైజాబాదు చేరగానే స్నానాలు చెయ్యవలసిన వారు బాత్‌రూములకు వెళ్ళారు. స్నానాలుచేసి సిద్ధంగా ఉన్న కొందరం భోజనాలు ముగించుకుని ప్లాట్‌ఫారంమీద తిరుగసాగినాము.

"అయోధ్య ఇక్కడికి నాలుగు మైళ్ళ దూరంలోనే కదా వున్నది? దాన్ని ప్రోగ్రాములో చేర్చలేదేమీ?" అని గయిడ్ చూస్తూ శ్రీ అనంతపద్మనాభశాస్త్రిగారు అన్నారు ఒక బెంచీమీద కూర్చుని.

"అవును. చేర్చవలసిందే! కాని, దాన్నికూడా చేరిస్తే మరొక రోజు ఎక్కువ అయిపోతుందని మానిచేశారు. అయోధ్యా, గయలలో ఒకదాన్ని వదులుకోక తప్పదు. అయోధ్యకంటే గయే కదా ముఖ్యమైంది! అందువల్ల గయను మాత్రం విడవవద్దని చాలామంది అన్నారట. అయోధ్య విడవబడింది" అన్నాను నేను.

"మళ్ళీ వస్తామా? చూస్తామా? ఇంతదూరమూ వచ్చి అయోధ్య చూడకుండా వెళ్ళడం—ఎంతో కష్టంగా వున్నది. శ్రీరాముని కాలంనాటిదిగదా అది!"

"శాస్త్రిగారూ! అయోధ్యను చూడలేదని మీరు విచారించ నక్కరలేదు. రామాయణంనాటి పట్నం ఇప్పుడున్నదని మనం భావించనక్కర్లేదు. పట్నమేమో ప్రాచీనమే కాని, యుగయుగాలనాటిది కాదు. నేనిదివరలో చూశాను కాబట్టి మనవిచేస్తున్నా. పుత్రకామేష్టి జరిగిన చోటు అని చిన్న చోటు చూపుతారు. శ్రీరాముడు జన్మించిన చోటు అని ఒక చిన్న కొట్టు చూపుతారు. అక్కడ బొమ్మల్ని వుంచుతారు. ఇవన్నీ విశ్వసించతగ్గవిగా తోచదు.

అయోధ్యలో రాముని దేవాలయంకంటె హనుమంతుడి ఆలయమే పెద్దది. సీతారామలక్ష్మణుల సువర్ణ విగ్రహాలు వూరికి చివర ఒక మండపంలో వున్నవి. ఒక్కరు వెళ్లినా, పదిమంది వెళ్లినా సరే, ఒక జట్టుకు రూపాయి పావలా ముడుపు చెల్లిస్తేగాని విగ్రహాల ముందున్న తెర ఎత్తరు, మేము ముగ్గురంమాత్రం వెళ్లాము. కొంతసేపు ఘర్షణ జరిగిన తర్వాత నాలుగణాలకే మాకు దేవదర్శనం లభించింది."

"అక్కడ మరేమీ విశేషం లేదా?"

"సరయూనదీ స్నానం విశేషం. అయితే ఒకటున్నది. —నీళ్ళలో అడుగు పెట్టినవెంటనే తాబేళ్ళు కాళ్ళలో పడతాయి, మధురలోలాగనే. అయినా వాటివల్ల అపాయం ఏమీ వుండదు. ఒడ్డున అమ్ముతున్న పేలాల వుండలను కొని వాటి నోటికి అందిస్తే అవి కమ్మగా తింటాయి. ఏవీ లేనప్పుడు గుడ్డలుకూడా లాగి తినివేస్తాయి."

మే మిలా మాటలాడుకుంటూవుంటే మా కారుకట్టిన ప్యాసింజరుబండి వచ్చింది. మేము బండి ఎక్కిన పావుగంటకు అది బయలుదేరింది. అలహాబాద్ ఇక్కడినుంచి 98 మైళ్లు. ఇది ప్యాసింజర్ కావడంవల్ల—ఇంత దూరం వెళ్ళడానికి ఆరు గంటలకాలం పట్టింది. 3 గం. లకు సుల్తానుపురం జంక్షను వచ్చింది. ఇక్కడినుంచి ఒక లైను జఫారాబాద్ మీదుగా మొగల్‌సరాయికి పోతుంది. మరొకటి వాయవ్యమూలగా లక్నోకు పోతుంది. మరొక గంటకు చిల్‌బిలాఇక్కడినుంచి ఒక లైనురేబారిలీ మీదుగా లక్నోపోతుంది. తర్వాత ప్రతాపఘర్ ఇక్కడినుంచి ఒక లైను ఆగ్నేయంగాపోయి, జంఘయి మీదుగా కాశీవెళ్లుతుంది. పిదప ప్రయాగప్రక్కనేగంగాతీరాన

ఘాఘామావు జంక్షను వస్తుంది. అక్కడినుంచి ఒక లైను వాయు వ్యంగా—గంగా తీరాన్నే పోయి మళ్ళీ గంజి చేరుతుంది. దానికి ఎనిమిది మైళ్ళు గంగ దాటి వెళ్లితే అలహాబాద్ జంక్షను వస్తుంది. మేము ఏడుగంటలకు అక్కడికి చేసుకున్నాం.

ఉత్తరరైల్వేలో వున్న ప్రధాన కేంద్రాల్లో అలహాబాద్ ఒకటి. ఇక్కడినుంచి తూర్పుగా మొగల్ సరాయికీ, జంఘయి మీదుగా కాశీకీ వేర్వేరు లైనులున్నవి. పడమటగా ఝాన్సీకీ వాయవ్యంగా కాన్పూరుమీదుగా ఆగ్రాకు ఢిల్లీకి లైనులు ఉన్నవి. దీని ప్రక్కనున్న నాయినినుంచి సెంట్రల్ రైల్వే లైనొకటి ఇటార్సీకి వెళ్ళుతుంది. మరొక లైను రాయబరేలీ మీదుగా లక్నోకు ఉన్నది. ఇవి కాకుండా ఈశాన్య రైల్వే వారి చిన్నలైను ఇక్కడినుంచి కాశీమీదుగా ఈశాన్య దిక్కుగా వెళుతుంది. ఇంత ప్రాముఖ్యం వున్నా, ఇక్కడ నూతన పద్ధతిలో సౌకర్యాలు లేవు. స్టేషనుమాస్టే పురాతనమైంది. మా కారు ఎక్కడో మారుమూలకు తోసి వెయ్యబడింది. అక్కడ నీటికి ఎలాంటి సదుపాయమూ చెయ్యబడ లేదు. మా లీడరు స్టేషనుమాస్టరుకు తెలుపగా "మీ కష్టాలు నాకు బోధపడ్డాయి. అయితే మాత్రం మేమేమి చెయ్యగలం? ఇక్కడ ఏర్పాట్లకు తగిన వసతులు లేవు" అని చెప్పాడు. ఇంతలో శ్రీ సుందరంగారు బాటరీ ఛార్జి చేసే పని వారినీ, నీటి సప్లయిచేసే నౌకర్లనూ తీసుకువచ్చి, వారవల్ల మేము పనులు చేయించుకుంటామని చెప్పగానే—స్టేషను మాస్టరు మరి మాటలాడలేకపోయాడు. మర్నాడు అన్ని సదుపాయాలూ చేసితీరుతామని చెప్పి, వాళ్లు ఆ మర్నాడు అలాగే చేశారు.

# త్రివేణీ పునీతమైన ప్రయాగ

అలహాబాద్ (ప్రయాగ)లో ప్రధానమైనది త్రివేణి స్నానం. మత విషయంలో ఎక్కువ పట్టుదల వున్నవారు తీర్థ శ్రాద్ధాలూ, అవీ జరిగించడం కద్దు. కాని, అక్కడి పురోహితుల ధోరణిబట్టి చూస్తే సామాన్యులకు అవి అందు బాటులో వుండేటట్లు కానరాలేదు. "ఇలా జరిగితేనే పుణ్యం; లేకపోతే అది పూజ్యం" అనే రీతిగా వారు చెప్పినప్పుడు— డబ్బు నిచ్చి పుణ్యాన్ని కొనుక్కోవడం ఎంతవరకూ భావ్యం! అనే సందేహంలో పడడంకూడా సహజమే. మాలో చాలా మందిమి త్రివేణి స్నానంతోటే తృప్తి పడదలచాము. ఆ తర్వాత కోట, ఆనంద భవనం, మ్యూజియమూ, యూని వర్సిటీ చూడదలచాము.

మేము 27-వ తేదీ ఉదయాన్నే అవసరాలు నెరవేర్చు కుని బయలుదేరాము. కొందరం తప్ప తక్కినవారు కాఫీ, ఫలాహారాలు స్వీకరించారు. కొంచెం మునురుగా కూడా ఉండినది. మేము కొన్ని టాంగాలు మాటలాడుకుని త్రివేణీ సంగమానికి బయలుదేరాము. బస్సు ఏర్పాటు చేసుకోలేదు. టాంగాకు నలుగురం వంతున కూర్చున్నాం. చెప్పడం మరిచా: ఉత్తరదేశం అంతటా టాంగాలలాగే 'ఎక్కా'కూడా ప్రయాణ సాధనమే. అది పూర్వకాలపు రథం మాదిరిగా ఉంది. స్థూలకాయులైతే ఒక్కరే కూర్చోవచ్చును. సామా న్యులైతే ముగ్గురు కూర్చోవచ్చును. అంటే మధ్యను

ఒకరూ, చెరివక ప్రక్క ఇద్దరూ! ప్రక్క కూర్చున్నవారి కాళ్లు చక్రాలమీద ప్రేలాడుతూ వుంటాయి. కాబట్టి వారు కొంత భద్రంగా కూర్చోవలసి వుంటుంది. మేమీ అవస్థపడ లేక వాటిని విడిచిపెట్టాము. మొదట వీటిని అగ్రాస్టేషన్ దగ్గర చూచినప్పుడే మాలో చాలామందికి నవ్వు వచ్చింది. కొంత అలవాటుపడినవాళ్లం మాత్రం మౌనం వహించాము.

త్రివేణీ సంగమానికి తీసుకువెళ్లాలని మేము కోరగా బండీవాళ్లు అలాగే అని, దానికి తగినట్లు అద్దె నిర్ణయించుకున్నారు. తీరా, వారు తీసుకువెళ్ళిన స్థలం కోటకు ఉత్తరంగా ఉన్న రేవు. "ఇదేమిటి? మమ్మల్ని త్రివేణీ సంగమానికి తీసుకువెళ్లాలని కోరితే ఇక్కడికి తెచ్చారేమిటి?" అని అడగ్గా వాళ్ళు "మహారాజ్! త్రివేణి సంగమానికి ఇక్కడినుంచే పడవలో వెళ్లాలి. అందరూ అలాగే వెళ్ళుతారు. మిమ్మల్ని కోటకు అవతలి భాగంలో విడిచిపెట్టడానికి మాకేమీ అభ్యంతరం లేదు. కాని, అక్కడినుంచి మీరు అరమైలు దూరం బురదలో నడవవలసి వుంటుంది. అందుచేతనే ఇక్కడికి తీసుకు వచ్చాము" అన్నారు. పడవవాళ్లకూ, టాంగావాళ్లకూ ఏదో సంబంధం వుంటుందని, అందుకోసమే యిలా జరిగిందనీ మేము అనుకున్నాము. అక్కడనుంచి త్రివేణిసంగమానికి వెళ్లి తిరిగి రావడానికి—చివరకు రెండు రూపాయలకు పడవ వాడు సమ్మతించాడు. రేటుప్రకారం పన్నెండణాలకు ఒక దమ్మిడీ ఎక్కువ యివ్వనక్కరలేదనీ, ఇవ్వకూడదని నియమం ఉన్నదట, ఆ సంగతి తర్వాత తెలిసింది. చాలాదూరం వెళ్లేక పడవవాడు "బాబూ! పోలీసువాళ్లు వచ్చి 'ఎంత ఇచ్చారు?' అని అడిగితే పన్నెండణాలే అని చెప్పండి. మీరు మాకు

రెండు రూపాయలిచ్చినా, మా చేతిలో పడేది పన్నెండణాలు మాత్రమే. తక్కినది మామూళ్ల కింద పోతుంది'' అన్నాడు.

యమున చాలా లోతైన నది. గంగకు లోతు తక్కువ. ఈ రెండూ కలిసినచోట గుండె లోతు నీరుంటుంది. అక్కడ చాలా పడవలు కొయ్యలకు కట్టబడి వుంటాయి. కొన్ని బల్లకట్టులుకూడా వుంటాయి. కావలసిన వస్తువులు అక్కడే దొరుకుతాయి. మేము పూజకు, ఫలాలు, పుష్పాలు —పసుపు కుంకుమలు మొదలైనవి కొని, నదీపూజ చేసి, స్నానంచేసి, తిరిగి వెనక్కు వచ్చాము. తర్వాత అక్కడి నుంచి కోటకు వెళ్లాము. లోపల ప్రవేశించడానికి మావద్ద అనుమతి పత్రం వుండనే వున్నది. అది అక్బరు కట్టించిన కోట. గంగా, యమునలు కలిసేచోట అది కట్టబడివున్నది. అక్కడ ఇప్పుడు ప్రభుత్వ కార్యాలయాలు కొన్ని వున్నవి. భూమి లోపల వున్న దేవాలయం చూడతగింది. ఆ దేవాలయానికి సమీపంగా కోటప్రక్కనున్న ఆంజనేయ విగ్రహం బ్రహ్మాండమైంది. దక్షిణాదని శుచీంద్రంలో మాత్రమే యిలాంటి విగ్రహం చూచాము.

మేము అక్కడినుంచి బయలుదేరి తిన్నగా యూనివర్సిటీ భవనాలున్నచోటికి వెళ్లాము. ఆ భవనాలను బయటి నుంచి మాత్రంచూడ వీలుకలిగింది. అక్కడినుంచి ఆనంద భవనానికి వెళ్లాము. అది మన భారతప్రధాని జవహర్‌లాల్ పండితుని భవనం. దానిప్రక్కనే స్వరాజ్యభవనం ఉన్నది. దాన్ని పండిత మోతీలాల్ నెహ్రూగారు కాంగ్రెసు కమిటీకి దానం చేశారు. పూర్వం అది భారత కాంగ్రెసుకమిటీకి కేంద్రంగా ఉండింది. శ్రీ జవహర్‌లాల్ పండితుని అర్ధాంగి శ్రీమతి కమలా

నెహ్రూ పేరిట స్థాపించబడిన పెద్ద వైద్యశాల అక్కడ ఉన్నది. ఆనందభవనానికి సమీపంలోనే భరద్వాజాశ్రమం వుందనీ, అది సుప్రసిద్ధ క్షేత్రమనీ కొందరు చెప్పగా అక్కడికి వెళ్ళాము. అక్కడి పూజాపునస్కారాల విషయంలో స్త్రీలదే యాజమాన్యం! వివిధ దేవతల దర్శనంకోసం వాళ్లు నిర్బంధించగా—అక్కడినుండి తప్పించుకు రావడమే విశ్వ ప్రయత్నమైంది,

తర్వాత మేము మ్యూజియముకు వెళ్లాము. మ్యూజియం పెద్దది కాదు. కాని దీనిలో ఒక విశిష్టత ఉన్నది. మన ప్రధాని జవహర్‌లాల్ గారికి ఇవ్వబడిన బహుమానాలన్నీ ఇచ్చట ఉంచబడినవి. వాటిని ఆ మహాత్యాగి తాను స్వంతానికి ఉంచుకోకుండా ఈ వస్తుప్రదర్శనశాలకు సమర్పించారు.

అప్పటికి పన్నెండు గంటలు దాటినది. మేము కాఫీ అయినా త్రాగనందున బాగా ఆకలి వేసింది. నాలుగు వైపులా చెదరిపోయిన మిత్రులందరూ మ్యూజియందగ్గర కలుసుకోవడంవల్ల—అందరమూ కలిసే స్టేషనుకు వెళ్లాము.

భోజనానంతరం గుడ్డలు ఉతికి ఆరవేసుకుని స్టేషను పూర్తిగా చూచి వచ్చాము. అప్పటికి టాంకుల నిండా నీరు నింపడమూ, బాటరీ చార్జి చెయ్యడమూ జరిగాయి.

కొంచెంసేపు విశ్రాంతి తీసుకున్నాక నేనూ, మిత్రులు వెంకటేశన్‌గారూ కలిసి బజారువీధివైపు వెళ్ళాము. గంట, గంటన్నరసేపు వూరు తిరిగి ఆరున్నరకు కారు చేరుకున్నాము. భోజనానంతరం హాయిగా విశ్రమించాము.

రాత్రి పన్నెండుంబావుకు వచ్చే తుఫాను ఎక్స్‌ప్రెస్‌కు మా కారును కట్టవలసి వుంది. మా తర్వాతి మజిలీ కాశీ.

నిద్రలో వున్నందున బండీకి కారు ఎప్పుడు కట్టారో మాకు తెలియనేలేదు. కాని, పన్నెండు గంటలకు మా కారు అలహాబాదు స్టేషనుయార్డులో యీ మూలనుంచి ఆ మూలకు అయిదారుసార్లయినా తిరిగినట్లు గ్రహించాను. మరోమారు తెలివొచ్చి చూస్తే అది డిస్టెంటు సిగ్నల్సు దాటిపోతూ వున్నట్లు తెలిసింది. అందువల్ల మా కారు బండీకి కట్టబడిన దనీ, బండీ ప్రయాణించేస్తున్నదనీ వూహించాను. మేము మొగల్‌సరాయి వెళ్లేక—మా కారును బండీనుంచి తప్పించి, కాశీకి వెళ్లే ప్యాసింజరుకు కట్టవలసివున్నది.

అలహాబాదునుంచి మొగల్‌సరాయి జంక్షను తొంభై నాలుగు మైళ్ళు. ఇంత దూరమూ రెండున్నర గంటలకాలం లో దాగలిగాము. కారణం ఏమంటే అలహాబాదు నుంచి మొగల్‌సరాయి వరకూ జంటమార్గం వున్నది. అదీగాక మధ్యను, మీర్జాపూరు అనే ఒక్కచోట తప్ప. మరెక్కడా బండీ ఆగలేదు. మూడు కొట్టకుండానే మేము మొగల్‌సరా యికి వచ్చాము. వెంటనే మా కారును డిటాచ్ చేసి, ఏడు గంటల ప్యాసెంజరుకు కట్టి బనారస్ కంటోన్‌మెంటుకు చేర్చ వలసిందని స్టేషనుమాస్టరుకు తెలిపాము. అతడు "ఏడుదాకా ఎందుకు? నాలుగు గంటలకు ఇక్కడినుంచి లక్నో ప్యాసింజరు బయలుదేరుతుంది. దానికే ఎటాచ్ చేయిస్తాను. మీరు కొంత ముందుగా వెళ్లవచ్చునుకూడా" అని అన్నాడు. "అలా అయితే మరీ మంచిది" అనుకున్నాం. కాని, అక్కడి పని వాళ్లు మా కారును విడదీసి, చాలాదూరం తీసుకుపోయి, తిరిగీ తెచ్చి మేము వచ్చిన బండీకే తగిలించారు. "ఇదేమిటి మేము వెళ్ళవలసినది కాశీ కాని, కలకత్తా కాదు. మళ్లీ

దీనికే తగిలిస్తే మీరు ఎందుకు విడదీసినట్లు?" అని వారిని అడగ్గా "ఓహో! అలాగా?" అంటూ వాళ్ళు ఆ పెట్టెను తీసుకుపోయి, లక్నో ప్యాసింజరుకు తగిలించారు. ఆ మహానుభావుల తెలివితేటలకు అందరమూ విరగబడి నవ్వుకున్నాం.

ఎనిమిది గంటలకు బనారస్ కంటోన్మెంటు స్టేషనుకు చేరవలసిన మేము మొగల్‌సరాయి స్టేషను మాస్టరు దయవల్ల నాలుగుమ్ముప్పావుకే చేరాము. మా కారు యార్డులోని చివరి ప్లాట్‌ఫారం కొసను నిలపబడినది. అక్కడ బ్యాటరీ ఛార్జి చెయ్యడానికి వీలున్నది. సిటీకి బస్సుల సౌకర్యముగా వున్నది. అందువల్ల మాకు ఎక్కువ శ్రమ అనిపించడం లేదు.

బనారస్ కంటోన్మెంటు ఒక జంక్షను. ఇక్కడినుండి లక్నో మీదుగా ఉత్తర రైల్వేవారి మెయిను లైనున్నది. అంతేకాక జంఘయి మీదుగా లక్నోకు దగ్గర దారీ, ఆ దారి మీదుగా అలహాబాదుకు మరొక మార్గమూ వున్నవి. మొగల్ సరాయినుంచి ఇక్కడికి జంటమార్గం వున్నది. ఈశాన్య రైల్వే వారి చిన్నలైను ఇక్కడినుండి అలహాబాదుసిటీ, సారనాథ మీదుగా వాయువ్యదిశకూ పోతుంది. రైళ్ళ రాకపోకలతో ఎప్పుడూ స్టేషను సందడిగా వుంటుంది.

# భుక్తి ముక్తుల నొసగే వారణాసి

సరిగా మేము ఏడు గంటలకు బయలుదేరి స్టేషన్ బయటికి వచ్చాము. అక్కడ బస్సులు సదుపాయంగా ఉన్నందు వల్ల వేరే ఏర్పాటు అవసరం లేకపోయింది. మనిషికి ఒకటిన్నర అణావంతున ఇచ్చి మేము బస్సులో గుదాలియాకు వెళ్ళాము. కాశీలో అనేకమైన స్థలాలు నాకు చిర పరిచితాలయినందున నేనే మార్గదర్శకత్వం వహించాను. అక్కడినుంచి ఇంచుమించు అరమైలు నడచి, దశాశ్వమేధ ఘట్టానికి పోయి అందరమూ గంగాస్నానం చేశాము. తర్వాత—సమీపంలోనే వున్న విశ్వనాథుని గుడికి పోయి, దేవదేవుని లింగస్వరూపాన్ని దర్శించాము. దగ్గరనే వున్న ధుండి విఘ్నేశ్వరుని, అన్నపూర్ణమ్మనూ, విశాలాక్షీ దేవినీ చూచామని వేరే చెప్పేదేమిటి?

తర్వాత మేము హిందూ విశ్వవిద్యాలయానికి బస్సు మీద వెళ్లాము. అది పట్నానికి మూడుమైళ్ల దూరంలో ఉన్నది. ఆ ప్రదేశమంతా ఒక పట్నంలాగానే కానవస్తుంది. యూనివర్సిటీకి దసరాలకు సెలవు. అందువల్ల విద్యాలయా లన్నీ మూయబడి ఉన్నవి. సైన్సు కాలేజీ లేబొరేటరీలో కొందరు పనిచేస్తూ వుండడంవల్ల వారి అనుమతి తీసుకుని ఆ భవనంమీదికి ఎక్కి చూచాము. శివాజీహాలు అనే వ్యాయామ మందిరం, శివాలయం, గ్రంథాలయం మున్నగు వాటిని చూచి ఇంత గొప్ప విశ్వవిద్యాలయ స్థాపనకు కారకులైన

శ్రీ మదనమోహన మాళవ్యాపండితుని పవిత్ర నామాన్ని స్మరించి, మాకోసం నిరీక్షిస్తున్న బస్సు ఎక్కి గురాలియాకు వెళ్ళి అక్కడినుంచి మరొక బస్సులో స్టేషన్‌కు వెళ్ళినాము.

భోజనానంతరం నలుగురూ, నాలుగు వైపులకూ చెదరి పోయారు. మేము అయిదుగురం కాశీకి ప్రక్కనున్న ప్రసిద్ధ బౌద్ధక్షేత్రం సారనాథ్‌ను—అంటే మృగదావాన్ని చూడ డానికి వెళ్ళాలనుకున్నాం. అక్కడికి వెళ్ళడానికి బస్సుసౌకర్యం లేదు. ప్రయివేటుబస్సు ఏర్పాటు చేసుకోవాలి. లేదా టాంగాలు మాట్లాడుకోవచ్చు. ప్రతి నిత్యము వేలాదిమంది జనం అక్కడికి వెళ్తూనే వుంటారు. అటువంటప్పుడు తగిన సౌకర్యం ఎందుకు చెయ్యబడలేదో తెలియలేదు. మేము ఐదుగురం ఒక టాంగాను ఎక్కాం. రెండింటికి తక్కువ. అందు వల్ల మూడు గంటలకు బయలుదేరే ఈశాన్య రైల్వేవారి బండిమీద వెళ్ళడానికి నిశ్చయించుకొని టిక్కెట్లు కొన్నాం. తీరా, ప్లాట్‌ఫారంమీదకు వెళ్ళేసరికి బండి గంట లేటని తెలిసింది. ఆ స్టేషన్‌లోనే చిన్నరైనులో ఒక ఇంజను పట్టాలుతప్పి ఒరిగిపోయివుంది. అందువల్లనే ఈ విలంబం!

బండి నాలుగుగంటలకు వచ్చినా, అరగంటకు పైగా నిలిచిపోయింది. అయిదుమైళ్ళదూరం అరగంటకుగాని పోవీలు లేకపోయింది. మొత్తంమీద ఒక గంటసేపు ఆ బండిలో వుండవలసివచ్చింది. ఆ గంటా ఒక యుగంలాగా తోచింది. బండిలో ఫానులు లేవు. దొడ్లలో నీళ్ళు లేవు. కిటికీలు చాలా భాగం విరిగినవే. మురికిగుడ్డలతో—దుర్గంధం గుప్పున కొట్టుకుంటూ, చెమట లోడుకొని వస్తూవున్న పల్లెజనం—ఒక్క పెట్టెలోనే ఎక్కసాగారు. కొంచెం జాగా యివ్వగా

కూర్చున్న పల్లెపడుచులు—అంతలోనే నిద్రమత్తుచే ప్రక్క వారి భుజాలమీదకు ఒరగసాగారు. దుర్భిక్షంలో అధికమాస మన్నట్టుగా—ఇలాంటి సందర్భంలోనే రైల్వేవారి దత్త పుత్రులు— సంగీత కళాభిజ్ఞులు కొందరు జనాన్ని తోసుకని లోపల ప్రవేశించి, గొంతు విప్పి తమ గానమాధుర్యాన్ని, వినిపింపసాగారు. వారిలో ఒక మహిళామణికూడా ఉన్నది. ఆమెది కోకిల కంఠం. ఆమె పాట వినడానికి మేము కూర్చున్న పెట్టెదగ్గర జనం మూగారు. అందువల్ల కిటికీల్లోంచి వచ్చే కాస్తా గాలీ రాకుండా ఆటంకం కలిగింది.

మేము ఐదు గంటలలోగానే సారనాథ్ చేరుకున్నాం. బండి దిగి చూద్దును, ఏదో కొత్తస్టేషన్‌లో దిగినట్లని పించినది. నేనొక రిప్-వాన్-వింకిల్‌ను అయినట్లు తోచింది. పాతికేళ్ళ క్రిందట ఉన్న స్టేషన్ ఇప్పుడు కానరాలేదు. అది స్తూపం ఉండే చోటుకు అరమైలు వెనుకగా—బౌద్ధదేవాలయాలకు కొంత దగ్గరగా కొత్తపద్ధతి స్టేషన్ కట్టబడింది. అక్కడ బౌద్ధ కళను కన్నుల కట్టించే గేటు ఏర్పాటు చేయబడింది. పిదప అయిదు నిమిషాల్లో మేము ఆ క్షేత్రంలో ప్రవేశించాము.

సారనాథం బౌద్ధక్షేత్రాల్లో ముఖ్యమైంది. క్రీస్తు పూర్వం ఆరవ శతాబ్దంలో బుద్ధదేవుడు తన అయిదుగురు శిష్యులకు ధర్మోపదేశం చేసిన చోటు. అశోకుని కాలం నుంచీ యిది గొప్ప బౌద్ధక్షేత్రంగా పేరుపడింది. ఈ చోటు సద్ధర్మచక్ర ప్రవర్తన విహారంగా ఆ కాలంలో వ్యవహరింప బడేదట. అక్కడ దాదాపు ఒక చదరపు మైలు విస్తీర్ణంలో ప్రాచీన శిథిలాలు ఉన్నవి. అవి అశోకుని కాలంనాటివట! శాంతి, ధర్మాలకు గుర్తుగా అశోకుడు నిలిపిన స్తంభంయొక్క

అడుగుభాగం మాత్రం కనబడుతున్నది. దీని మీదిభాగం సింహాలతోనూ, ధర్మచక్రంతోనూ గుర్తింపబడి ఉన్నది. అదే నేటి భారతదేశ చిహ్నం! ఆ మీద భాగం అక్కడి మ్యూజియంలో ఉన్నది. మ్యూజియంలో చాలా బుద్ధవిగ్రహాలూ, రాతి ఛత్రాలూ మొదలైనవి ఉన్నవి. విగ్రహాలలో నిలువెత్తువికూడా ఉన్నవి.

ఇక్కడున్న "ధామేఖ్" స్థూపం ఎంతో పెద్దది. క్రీస్తుపూర్వం 273-వ సంవత్సర ప్రాంతంలో ఇది నిర్మితమైనది. దీని ఎత్తు 143 అడుగులు. వ్యాసం 93 అడుగులు. స్థూపం అడుగుభాగంలో శిల్పాలు ఎక్కువగా కానవస్తాయి. ఇక్కడ చీనాదేశంవారు నిర్మించిన బౌద్ధదేవాలయం ఉన్నది. ఇక్కడి బుద్ధవిగ్రహం పాలరాతితో నిర్మితమైంది. పరిసరాలను మరచిపోయి, యీ దేలూలను చూస్తున్నంతసేపు చీనాదేశంలో వున్నట్టే అనిపిస్తుంది. ఈ దేవాలయానికి సమీపంలోనే మూల గంధకుటీ విహారం వున్నది. ఇదే యిక్కడి పెద్ద బుద్ధాలయం. మహాబోధి సంఘంవారు 1931లో దీన్ని నిర్మించారు. ఆ ఆలయ ప్రారంభోత్సవాల సమయంలో కాశీలోనే ఉండడంవల్ల వాటిని చూసే అవకాశం నాకూ కలిగింది.

సారనాథ్‌లోని వివిధ స్థలాలను మేము చప్పచప్పన చూచేసరికి ఆరుగంటలు పైగా అయినది. అక్కడ రిక్షాలు గాని, టాంగాలుగాని లభించలేదు. రైలుమీద కాశీకి పోదామంటే—రాత్రి తొమ్మిదింటికిగాని బండి లేదు. ప్రయాణ సౌకర్యాలనుగూర్చి ఒకరిద్దరిని అడిగితే—రెండు ఫర్లాంగుల దూరంలో అడ్డు రోడ్డు వస్తుందనీ, అక్కడ తప్పకుండా

రిక్షాలూ, టాంగాలూ లభిస్తాయనీ చెప్పారు. అప్పటికి బాగా చీకటి పడింది. మేము రోడ్డు పైని మైలు దూరం నడిచినా అడ్డురోడ్డు రాలేదు. ఎదురుపడినవారి నడిగితే "అదిగో—ముందున్నది" అనేవారు. ఇంతలో సారనాథ్‌నుంచి ఒక తిరుగు రిక్షా వస్తూవుండగా బేరం చేశాము. గుదాలియాకు గాని, స్టేషనుకుగాని ఎక్కడికయినా రెండు రూపాయ లివ్వా లన్నాడు. మేము ఒక్క రూపాయి యిస్తామన్నాము. "రెండు రూపాయిలకు దమ్మిడీ తక్కువైతే ఎవ్వడూ రాడు" అని వాడు బిగువుగా మాటలాడినాడు. మేము కొత్తవారిమనీ, దారి తెలియదనీ, ఎంత అడిగితే అంత ఇస్తామనే తలంపుతో. మాకు కావలసినవి రెండు రిక్షాలు. నడవడానికి వెనకతీస్తున్న యిద్దరిని ఆ రిక్షాలో అడ్డురోడ్డుదాకా పంపివేశాము, పావలా యిచ్చి.

మేము అడ్డురోడ్డుకు వెళ్లేసరికి ఏడు దాటింది. వెనకటి రిక్షావాలాతోపాటు మరి ముగ్గురున్నా రక్కడ. బేరం పెడితే —అందరూ "బేడ తక్కువ రెండు రూపాయలు"అన్నారు. దమ్మిడీ తగ్గమన్నారు. మేము పధ్నాలుగణా లిస్తామన్నాము. ఆ సమయంలో ఒక తగుమనిషి అక్కడికిరాగా—సంగతి చెప్పాం. "పది అణాలకు ఒక దమ్మిడీ ఎక్కువ ఇవ్వనక్కర లే"దని, రిక్షావాలాలను తిడుతూ అతడు వాదించాడు. లాభం లేకపోయింది. అతడు కోపించి "అయ్యా! మీరు నావెంట రండి, రిక్షాలు ఏర్పాటుచేస్తాను. ఈ దుర్మార్గులను విడిచి పెట్టండి" అని—అక్కడికి ఫర్లాంగు దూరంలో వున్న గ్రామా నికి తీసుకువెళ్లి రెండు రిక్షాలను ఏర్పాటుచేశాడు. "బాబూ సాబ్‌లు ఎంత యిస్తే అంత పుచ్చుకోండి. ఎక్కువ అడగ

వద్దు''అని వాళ్లతో చెప్పి, మాతో ''ఊరి పొలిమేరకు ఆరేసి అణాలు ఇవ్వండి. అక్కడ మీకు కావలసినన్ని బళ్లు దొరుకుతాయి. నాలుగు అణాలు ఇస్తే స్టేషనుకు వెళ్లిపోవచ్చు తర్వాత'' అన్నాడు. అతను ఆ వూరి పెద్ద. అతని మాటకు తిరుగు లేదు. మేము అతనికి కృతజ్ఞతను తెలిపి రిక్షాలలో—ఒకదానిలో ఇద్దరం, రెండోకదానిలో ముగ్గురం కూర్చున్నాము. అక్కడికి కాశీ రమారమి మూడు మైళ్లు. మేము పొలిమేరకు వచ్చాక అద్దె ఇవ్వబోగా ఆ రిక్షావాలాలే స్టేషనుకు రావడానికి సిద్ధపడ్డారు. అందువల్ల పదేసి అణాలు యిచ్చి స్టేషను చేరుకున్నాం. ప్రక్కనున్న సారనాథ్‌కుపోయి రావడానికి ఇంత అట్టహాసం అయింది.

మా జట్టులోని మిగిలినవారు కొందరు మర్నాడు ఉదయం సారనాథుకు వెళ్లారు. మేము గంగలో తర్పణాదుల కోసం వూళ్లోకి వెళ్లాము, పరిచితులయిన కొందరు తీర్థపురోహితులను సంప్రతించగా, ప్రాయశ్చిత్తాదులు కావాలనీ, తీర్థవిధులూ మున్నగునవి సంగ్రహంగా జరిపినా ఇరవై రూపాయలు మనిషికి కాగలదనీ చెప్పారు. వారి మాటలనుబట్టి సాయంకాలం నాలుగు గంటలదాకా తంతు జరిగేటట్టు ఉన్నది. మూడు గంటలలోగా మేము స్టేషనులో ఉండితీరాలి. ఇవన్ని ఆలోచించి—మేము సంకల్పం మున్నగునవి ఉన్న పుస్తకం దగ్గర వుంచుకునే—శక్తి ననుసరించి తంతు జరుపుకున్నాం. తర్వాత కావలసిన వస్తువులను కొనుక్కొని పన్నెండు లోపుగానే మా కారు చేరుకున్నాము. నాకు పరిచితులు కొందరు ఆ వూళ్లో వున్నారు. అయినా అవకాశం లేనందున ఎవ్వరినీ చూడడానికి వెళ్ల లేదు.

మూడున్నర గంటలకు కలకత్తా వెళ్లే డూన్ ఎక్స్ప్రెస్ వచ్చింది. వెంటనే మా కారును దానికి తగిలించారు. తర్వాతి మజిలీ గయ. గయకు మొగల్ సరాయి మీదుగనే వెళ్లాలి. కాశీకి మొగల్‌సరాయి పదకొండు మైళ్లు. అయినా, గంగానది బ్రిడ్జిపై బండీ మెల్లగా నడపడంవల్ల మొగల్ సరాయి చేరడానికి గంటకుపైగా పట్టింది. ఆ స్టేషనులో మా పెట్టెను విడదీసినారు. ఎక్స్ప్రెసు బండీ చాలా పెద్దది. దానికి మా కారునుకూడా కడితే బరువెక్కువట. అందువల్ల ఆరు గంటలకు బయలుదేరే గయా ప్యాసింజెరుకు దీన్ని కట్టదలచినారు.

మొగల్‌సరాయి పెద్ద జంక్షను. ఉత్తర—రైల్వే ఇక్కడితో ముగిసిపోయి, ఇక్కడినుంచి తూర్పు రైల్వే ప్రారంభమవుతుంది. పడమట అలహాబాదుకూ, వాయవ్యంగా లక్నోకు వెళ్లేమార్గాలూ, ఈశాన్యంగా పాట్నాకూ, తూర్పుగా గయకూ వెళ్లే తూర్పు రైల్వేమార్గాలూ ఇక్కడ కలుస్తాయి. ఇక్కడినుండి కలకత్తావరకూ జంట మార్గాలు ఉన్నవి. మొగల్‌సరాయినుంచి గయ 127 మైళ్ళదూరం. ఈ మాత్రం దూరానికి మా బండి ఆరుగంటలు తీసుకుంది. ఎనిమిదిన్నర గంటలకు మేము సాసారాం అనే జంక్షన్‌వద్దకు వచ్చాము. ఇక్కడినుండి మెయిను లైనుపై ఉన్న ఆరా అనే చోటికి ఒక చిన్న లైను ఉన్నది. ఈ స్టేషన్ దాటగానే మిత్రులతో "ఇకమీద ఇరవై నిమిషాలకు ఒక మంచి దృశ్యం వస్తుంది. అది శోణానది. అది రమారమి మూడు మైళ్ల వెడల్పుగలది. ఇంత వెడల్పు నది భారతదేశంలో మరొకటి లేదు. దీని తర్వాతిదే గోదావరి" అన్నాను. "ఈ నది

ఎక్కడ కలుస్తుంది?'' అన్నారొకరు. ''మంచి ప్రశ్నే. ఇంత నదీ గంగానదికి ఉపనది. వర్షాకాలంలో ఇది ఒడ్డులు తీసి పారుతుంది. వేసవిలో ఒక్క చుక్కయినా వుండదు'' అని జవాబిచ్చాను. తర్వాత డెహ్రీ స్టేషను వచ్చింది. దాని తర్వాతనే నది వచ్చింది. నదికి ఆవలి ఒడ్డున సోన్ ఈస్ట్ బాంక్ — అనే స్టేషన్ ఉన్నది. తర్వాత చూడదగిన విశేషాలేమీ లేవు. అందరమూ ఒక కునుకు తీశాము. రాత్రి పదకొండు ముప్పావుకు గయకు చేరాము.

మాకంటే ముందుగానే ఇద్దరు ముగ్గురు మిత్రులు కాశీ నుంచి గయకు వెళ్లినారు. మహాలయం మొదలయినది జరిగించుకోవాలని చెప్తూ. ఆ వెళ్లినవారు తమ పనులు పూర్తి చేసుకుని మా బండికోసం ఎదురుచూస్తూ స్టేషనుకు వచ్చారు. ''ఇప్పుడు మహాలయపక్షము కనుక గయలో జనసమ్మర్దం అధికం. కలరా వ్యాపించి వున్నది. కనబడిన వారికల్లా ఆరోగ్యశాఖవారు దబ్బనంలాంటి సూదితో పొడుస్తున్నారు. మేము ఎంతో కష్టంమీద తప్పించుకున్నాం. విష్ణుపాదం, వటవృక్షం మున్నగుచోట్ల అసహ్యంగా వుంది. అది ప్రత్యక్షనరకమే! వూళ్లోకి వెళ్లదలచినవారు బాగా ఆలోచించుకుని వెళ్ళండి'' అని వారన్నారు.

ప్రధాన స్థలమైన గయలోనే జరుపవలసినవి జరుపుకోదలచి, తక్కినచోట్ల ఆ విషయంలో ఎక్కువ శ్రద్ధ చూపని మాకు, మిత్రుల మాట వినగానే ఆందోళన కలిగినది. స్టేషనులోనే ఇనాక్యులేషన్ జరుగుతున్నదట. వెంటనే జ్వరం వస్తే కార్యకలాపం జరగడమెలాగు? తర్వాతి ప్రోగ్రాములలో పాల్గొనడం ఎట్లా? ఇదే కలతపాటుకు కారణం!

# కడు ప్రాచీనమైన గయ

ఉదయం స్టేషన్ మాస్టరును భోగట్టా చెయ్యగా "అయ్యా! ఇక్కడి పద్ధతు లలాగున్నవి. మీలాంటివారిని ఆరోగ్య శాఖవారు నిర్బంధించ రనుకుంటాను. మరొక సంగతి: మూడవతరగతి ప్రయాణీకుల గేటువద్దనే యీ చిక్కు. మీరు మొదటి తరగతి ప్రయాణీకుల గేటుద్వారా రాక పోకలు సాగిస్తే చిక్కు వుండదు. మీకు నేను చేయగల ఉపకారం యిదే" అని ఆయన చెప్పాడు.

అప్పటికి ఆరు గంట లయినది. ఆ క్షేత్రంలో జరుప వలసిన విధులను నెరవేర్చే పురోహితుని ఏజంటు ఒకడు వచ్చి మాకోసం తనను ఒక దక్షిణాది పురోహితుడు పంపినట్లు చెప్పి, తన వెంట మమ్ము తీసుకు వెళ్లాడు. స్టేషన్ దాటినతర్వాత టాంగాలను నిర్ణయించి విష్ణుపాదందగ్గరఉన్న శంకరమఠానికి మమ్మల్ని తీసుకువెళ్లినాడు. ఫల్గునీనదీస్నానం, విష్ణుపాద వటవృక్షములదగ్గర పిండప్రదానం—మున్నగునవి పూర్తి చేసుకుని రెండు గంటలకు స్టేషన్ చేరుకున్నాము.

మా మిత్రులు భయపెట్టినంత అసహ్యంగా లేక పోయినా, జనసమ్మర్దంవల్ల విష్ణుపాదము మున్నగుచోట్ల కొంత కశ్మలంగా ఉన్నమాట వాస్తవం. ఆరోగ్యపద్ధతులకు వెనుకపడిన పట్టణాల్లో గయను మించినది లేదని ప్రసిద్ధి. జిల్లా ముఖ్యపట్టణమయి కూడా ఏ అధికారులూ దీని విషయం లో శ్రద్ధచూపకపోవటం చాలా ఆశ్చర్యకరం. స్టేషన్‌లోనూ

అదే పద్ధతి. మా పెట్టెతోపాటు ఒక పరదేశీయుల యాత్రా స్పెషల్ ప్లాట్‌ఫారం చివర వున్నది. యాత్రికులందరూ తమ వంటపొయ్యిలను ప్లాట్‌ఫారంమీదే పెట్టారు. ఆ ప్రక్కనే పిల్లలు స్వేచ్ఛగా మలమూత్ర విసర్జనలు చేస్తున్నారు. కొళాయిలవద్ద స్నానాలు చెయ్యగా, ఆ నీళ్లు ప్లాట్‌ఫారంలో చాలాభాగం ఆక్రమించాయి. వీటి నన్నిటినీ దాటుకుని మేము మా కారు చేరడమే కష్టమయ్యింది. మా స్టేషనులోని ఆరోగ్యశాఖవారు ఏలా ఉపేక్షించారో!

ఇది పెద్దజంక్షన్. ఇక్కడినుంచి మొగలుసరాయ్‌లోని పాట్నాకు, కియూల్‌నకు వేర్వేరు మార్గాలున్నవి. స్టేషను కూడా నూతన పద్ధతిలో పునర్నిర్మింపబడినది. కాని, ఆరోగ్య, సదుపాయాల్లో పురాతనపద్ధతిని అణుమాత్రమూ దాటలేదు.

భోజనానంతరం కొంచెంసేపు విశ్రాంతిని తీసుకుని అందరమూ బుద్ధగయకు బయలుదేరినాము. బుద్ధగయ స్టేషన్‌కు రమారమి ఎనిమిది మైళ్లున్నది. మేము ఒక బస్సును నిర్ణయించుకుని బయలుదేరాము.

బుద్ధగయ బౌద్ధులకు పవిత్రక్షేత్రం. ఇక్కడ పెద్ద బుద్ధ దేవాలయం వున్నది. దేవాలయానికి వెనుకభాగంలో ఒక రావిచెట్టు వుంది. బుద్ధుడు తత్వాన్ని కనుగొన్న స్థలం యిదే అని అంటారు. గౌతమబుద్ధుని కాలంలో వుండిన బోధివృక్షం నశింపగా సింహళద్వీపంనుంచి ఒక వృక్షశాఖను తెచ్చి, పెంచారట! అదే మహావృక్షమయి నేటికీ వున్నదని చెప్తారు. అంతేకాక దేవాలయం ప్రక్కను వుండే మరొక వృక్షం వున్నది. అదీ చాలా ప్రాచీనమైనదే అని అంటారు. సారనాథ్‌లో కొత్తగా దేవాలయాలు వెలసినట్లు ఇక్కడ ఏమీ

లేవు. దీని అభివృద్ధి విషయమై దఖలు తీసుకున్నట్లు తోచదు.

మేము అక్కడినుంచి బయలుదేరి వూరిలోని పెద్ద బజారువీధి మార్గంగా స్టేషన్‌కు వచ్చాము. ఆ వూరిలోని బజారువీధయినా ఆకర్షకంగా లేదు. మురుగునీరు పోవడానికి సరియైన డ్రెయినేజి పద్ధతి కానరాలేదు. స్టేషనుకు వచ్చిన తర్వాత కూడా—అనారోగ్యానికి నిలయంగా కానవచ్చే స్పెషల్ ట్రయినును దాటి మా కారుకు వస్తేనేగాని మనస్సుకు విశ్రాంతి కలగడం లేదు. ఎప్పుడు అక్కడనుంచి బయలుదేరుతామా—అని అనిపించింది.

మా తర్వాతి మజిలీ అసన్‌సోల్. మేము అక్కడ మా కారు నిలిపి, రైల్వే ఇంజనులను తయారుచేస్తూ వున్న చిత్తరంజన్ ఫ్యాక్టరీని చూడదలచుకున్నాము. బొంబాయి—కలకత్తా మెయిలు తెల్లవారుజామున మూడు గంటలకు గయకు వచ్చింది. దానికి మా కారు తగిలించబడినది. అక్కడినుంచి అసన్‌సోల్ జంక్షను నూటఅరవై మైళ్ళు. ఉదయం ఎనిమిదింబావుకల్లా మేము అక్కడికి చేరుకున్నాం.

గయకూ, అసన్‌సోల్‌కూ నడుమ రైలు కొండలపైని నడుస్తుంది. తర్వాతిది హజారీబాగ్ స్టేషన్. హజారీబాగ్ దాటిన తర్వాత గోమో జంక్షను వచ్చింది. ఇక్కడినుంచి దక్షిణానికి ఖరగ్‌పూరువరకూ దగ్గరదారి వున్నది. కలకత్తా నుంచి బయలుదేరే మదరాసు మెయిలు ఖరగ్‌పూరు మీదుగానే ప్రయాణం చేస్తుంది. అదీకాక గోమోనుంచి బార్కాకానా మీదుగా శోణానది తూర్పుగట్టుకు ఒక మార్గం వున్నది. తర్వాతి జంక్షన్ ధన్బాద్. ఇక్కడనుంచి ఝూరియాకున్నూ, కత్రాస్‌ఘర్‌కున్నూ శాఖామార్గాలు

ఉన్నవి. నేలబొగ్గు గనులకు ఈ ప్రాంతం కేంద్రం. చాలా చోట్లకు ఇక్కడినుండి బొగ్గు ఎగుమతి అవుతూ వుంటుంది. తర్వాత అసన్ సోల్ జంక్షను వచ్చింది. స్టేషనులోకి బండి రాగానే మా కారును విడదీశారు. మేము స్నానాల గదుల లోనూ, ప్లాట్ ఫారంమీదవున్న కొళాయిలదగ్గరా స్నానాలు చేశాము. భోజనానంతరం విశ్రాంతి తీసుకున్నాం.

మూడు గంటలు కొట్టకుండానే మేము చిత్తరంజను చేరుకున్నాము. మొదట్లో ఆ ఫ్యాక్టరీకి సంబంధించిన ఆఫీసుకు పోయి—అక్కడినుండి అనుమతిపత్రాన్ని తీసుకున్నాము. రైల్వేల అభివృద్ధిని గురించీ, ఫ్యాక్టరీ అభివృద్ధిని గురించీ ఏర్పరచిన పథకాలను అక్కడి ఉద్యోగులు మాకు మ్యాపు లను చూపుతూ వివరించారు. అవి చూచి, తర్వాత అక్కడి నుంచి రమారమి మైలుదూరంలోవున్న ఫ్యాక్టరీకి వెళ్ళాము. ఏభయిమందిని ఒక్కసారి—ఒక్కరు తీసుకువెళ్ళి చూపుతూ, ఆయా విషయాలను వివరించడం కష్టం. అందువల్ల మమ్మల్ని అయిదు జట్లుగా విభజించి, అయిదుగురు వేర్వేరు కర్మా గారవిభాగాలకు తీసుకుని వెళ్లారు.

చిత్తరంజన్ కర్మాగారం ఆసియాలో ఉన్న వాటిలో కల్లా పెద్దదట. ఇంజనులయొక్క భాగాలన్నీ ప్రస్తుతం ఇక్కడ తయారు కాలేదు. కొన్ని యిక్కడ తయారు కాగా, మరికొన్ని విదేశాలనుంచి తెప్పించబడుతున్నాయి. ఆ వివిధ భాగాలూ ఇక్కడ ఇంజనులుగా తయారు చెయ్యబడుతున్నాయి. దీని పని యీ నడుమనే ప్రారంభించబడినందున ప్రస్తుతంలో గూడ్సుబండ్లకుఉపయోగించబడే ఇంజనులే తయారవుతున్నవి. ఇప్పట్లో సగటున నెలకు పద్ధెనిమిది ఇంజనులు తయారవుతూ

ఉన్నాయట. మా గైడు వివిధశాఖల్లోకి తీసుకుని వెళ్ళి నట్సు తయారు చెయ్యడం దగ్గర్నుంచి ఇంజన్లు అమర్చడంవరకూ జరిగే కార్యక్రమాన్ని చూపాడు. ఆ మర్నాడు లైనుమీదికి పంపబడే ఇంజను లోపలి భాగాల్ని, నడిచే విధానాన్నీ వివరించి చూపాడు. మేము ఫ్యాక్టరీ చూశాముగాని, అక్కడి వారు చెప్పిన విషయాలు బాగా బోధపడలేదు. అక్కడి పనులు మాత్రం అద్భుతంగా జరుగుతూఉన్నట్లు గ్రహింపగలిగాము. యంత్రాగారాల్లో పనిచేసేవారికి మాకంటే చాలా సులభంగానూ, బాగానూ అక్కడి కార్యకలాపం బోధపడి వుండేది.

తర్వాత మేము వెళ్ళవలసిన స్థలం కలకత్తా. అక్కడ రెండు రోజులుండి చూడవలసినవన్నీ పూర్తిగా చూడదలచుకున్నాము. రాత్రి పదకొండుకు బయలుదేరిన మా బండీ మర్నాడు ఉదయం హౌరా స్టేషనుకు వచ్చింది. మాది ప్యాసింజరుబండీ కావడంవల్ల 145 మైళ్ళదూరం రావడానికి ఏడున్నర గంటలు పట్టింది. దారిలోని పెద్దస్టేషను బర్ద్వాను.

1956 అక్టోబరు 2–వ తేదీ ఉదయం ఏడుంబావుకు హౌరా స్టేషను చేరుకున్నాము. ఇంతవరకూ మేము చూసిన స్టేషన్లలో ఇదే పెద్దది. ఇక్కడ వేర్వేరుగా 13 ప్లాట్‌ఫారాలు ఉన్నవి. ఇంతకంటె బొంబాయిలోని విక్టోరియా టెర్మినస్ స్టేషను పెద్దదనీ, అక్కడ ఇరవై నాలుగో, ఇరవై అయిదో ప్లాట్‌ఫారాలున్నాయనీ అంటారు. ఇంతవరకూ బొంబాయికి వెళ్లే అవకాశం మాకు కలగటం లేదు.

# కన్నుల పండువైన కలకత్తా

మేము ఎక్కిన ప్యాసెంజరుబండీ 7–వ నంబరు ప్లాట్ ఫారం మీదకు వచ్చింది. బండీ స్టేషనులోకి రాగానే కలకత్తాలో మాకోసం ప్రయాణ సౌకర్యాలను, తక్కిన ఏర్పాట్లను కూర్చి అప్పలు శ్రీ వేంకటరామయ్య గారూ, శ్రీ గురుస్వామి గారున్నూ వచ్చి మమ్మల్ని కలుసుకున్నారు. వారు రెండు బస్సులను కూడా తీసుకువచ్చారు. ఆ బస్సులు 6–వ ప్లాట్ ఫారానికీ, 7–వ ప్లాట్ ఫారానికీ మధ్యనున్న రోడ్డుపై నిలుపబడి వున్నవి. మేమందరమూ ఆ రెండు బస్సులలోనూ కూర్చున్నాక, అవి పట్నంలోకి దారి తీసినవి.

మాకు ఏర్పాటు చెయ్యబడిన బస్సులు చాలా చిన్నవి. వాటిలో నిలువునా మూడువరసలు మెత్తలు వేసిన బెంచీలు ఉన్నవి. ఒక్కొక్క బెంచీమీద సర్దుకుని ఆరుగురేసి కూర్చోవచ్చును. ఈ విధంగా ఒక్కొక్కదానిలో ఇరవై మందిమి కూర్చున్నాము. ఇద్దరు వంటవారూ, కారుకు తగిన ఏర్పాట్ల కోసం సుందరంగారూ స్టేషలోనే ఉండిపోయారు. తమ బంధువులూ, మిత్రులూ ఆవూరిలో వున్నందున, ఈ రెండు రోజులూ వారితోనే వుండి, వారి సాయంతో విశేషాలు చూస్తామని ఏడెనమండుగురు వెళ్ళిపోయినారు. వారందరూ మర్నాడు రాత్రి బండి బయలుదేరే వేళకు స్టేషనుకు వస్తామన్నారు.

మేము ఎనిమిది గంటలకు బస్సులలో కూర్చుని బయలు

చేరాము. హౌరా స్టేషన్ ప్రక్కనే హుగ్లీనది ఉన్నది. కలకత్తా పూరిలోకి వెళ్లాలంటే దానిని దాటవలసినదే! నేను ఇరవై ఏళ్ళక్రిందట కలకత్తా వెళ్లినప్పుడున్న బ్రిడ్జి యిప్పుడు లేదు. అప్పటి బ్రిడ్జి స్టేషనుకు దగ్గరగా వుండినది. అది పడవల మీద కట్టబడి, నడిమి భాగం—స్టీమర్లు వెళ్ళేసమయంలో తీసివెయ్యడానికి అనుకూలంగా వుండినది. ఇప్పటి బ్రిడ్జి స్టేషనుకు కొంత ఎగువను ఉన్నది. ఇది సస్పెన్షన్ బ్రిడ్జి, దీనికి ఈ ఒడ్డునా, ఆ ఒడ్డునా తప్ప మధ్యను ఎక్కడా స్తంభాలు ఉండవు. ఆ ఒడ్లనున్న స్తంభాలనూ, వాటి ననుసరించిన బందోబస్తునూ అనుసరించి, నదిమీద బ్రిడ్జీఅంతా వేలాడుతూ ఉన్నట్లు ఉంటుంది: దీని నిర్మాణానికి ఏడెనిమిది కోట్ల రూపాయలు వ్యయమైనట్లు చెబుతారు. ఇది విశాలంగా వున్నది. మనుష్యుల రాకపోకలకు వేరే ఏర్పాట్లున్నవి, దీని పైని ట్రాములైనూ వున్నది. భారతదేశంలోని ప్రధానమైన దృశ్యాలలో ఈ హుగ్లీ వంతెన ఒకటి అని తప్పక చెప్పాలి.

మేము ఆయా వింతలను చూడాలనే అభిప్రాయంతో బస్సులు మెల్లగా నడపబడినాయి. బ్రిడ్జి దాటిని తర్వాత మేము కలకత్తానగరంలోని ప్రధాన వీధుల్లోంచి ప్రయాణం చేసి అరగంటసేపటికి విక్టోరియా మెమోరియల్ హాలుకు వెళ్లాము. నేను మెమోరియల్ హాలు ముప్ఫైవేళ్ల కిందటనే చూచాను. అప్పటికీ, ఇప్పటికీ అక్కడ మార్పులు ఏమీ కానరాలేదు.

ఇది పాలరాతితో కట్టబడిన గొప్ప భవనం. ప్రాచీన శిల్పాలూ, చిత్రాలూ ఇందులో భద్రపరుపబడి వున్నాయి. పూర్వపు రాజులయొక్క, బ్రిటిష్‌పరిపాలకులయొక్క, వైస్రా

యిలు మున్నగువారియొక్క నిలువెత్తు తైలవర్ణ చిత్రాలు ఎంతో ఆకర్షణీయంగా వున్నాయి. ఇదివరలో ఈ భవనాన్ని చూచినప్పుడు మేడమీదికి కూడా పోనిచ్చేవారు. మీది అంతస్తులలోకూడా అమూల్యములైన చిత్రాలు వుండేవి. భవనం శిఖరానికి వెళ్ళి చూస్తే కలకత్తా మహానగరం అంతా కానవచ్చేది. కాని, ఇప్పుడు టికెక్కట్లు పెట్టి డబ్బు వసూలు చేస్తూకూడా మీదికి వెళ్ళడానికి అవకాశం ఇవ్వలేదు. దానిని చూచిన తర్వాత ఒక దక్షిణాది హోటలుకు భోజనాల కోసం వెళ్లాము. అక్కడ మాకోసం భోజనం ముందుగానే ఏర్పాటు చేయబడివుంది. భోజనం రుచికరంగానే వున్నది. ఇన్నాళ్లకు మళ్లీ మంచి తాంబూలంకూడా లభించింది.

భోజనం అయ్యాక కొంతసేపు విశ్రాంతితీసుకుని జంతు శాలకు బయలుదేరాము. ముప్ఫయివళ్ళ క్రిందట చూచి నప్పుడు—మొత్తం 'జూ' చూడడానికి నాలుగు గంటలు పట్టినట్టు జ్ఞాపకం. అంతసేపు అక్కడే వుండి తక్కినవి చూడడం సాధ్యంకాదేమో అని తోచి—నా సందేశాన్ని లీడరుకు తెలియజేశాను. అతడు త్వరత్వరగా తిరిగి రావాలని హెచ్చరిస్తూ, మా జట్టుదారులకు ఒక గంట టైం ఇచ్చాడు. "ఆ టయిము చాల"దని నేను మనస్సులోనే అనుకున్నా, తోడి మిత్రులను తొందరగా చూడాలని కోరుతూ, ఒక గంట లోనే చూచుకుని వచ్చాను. ఉదయం పడిన వర్షంవల్లా, అంతకు ముందుపడిన వర్షాలవల్లా కొన్ని ప్రదేశాలు జలమయా లయి అగమ్యాలుగా ఉన్నవి. అందువల్ల కొంతభాగం చూడ డానికి వీలులేకపోయింది. ముప్ఫయివళ్ల క్రితం చూచినదాని కంటే విశేషం ఏమిన్నీ కానరాలేదు.

మేము అక్కడినుంచి బయలుదేరి కిడ్డర్ పూరుడాక్స్ చూడదలుచుకున్నాము. మార్గంలో 'జూ'కు సమీపంలోనే నేషనల్ లైబ్రరీ చూచాము. అది గొప్ప గ్రంథాలయం. భారత దేశంలో ప్రచురితమైన ప్రతీ పుస్తకపు ప్రతీ యిక్కడికి రావలసినదే! పిదప ఈశాన్య రైల్వేవారి ప్రధాన కార్యాలయం ఎదుటనుంచి కిడ్డర్ పూరు డాక్స్ ప్రక్కనుంచి వెళ్లాము. అక్కడ రెండు, మూడు స్టీమర్లు కానవచ్చాయి. లోపలికి పోయి చూడదగినదేమీ లేదని మా గైడ్సు చెప్పారు. అక్కడినుంచి మేము లేక్ వ్యూ మార్గంగా పోయి సన్నగా పొడవుగా వున్న సరస్సును చూచాము. అది చూడడానికి అంత ఆకర్షణీయంగా లేకపోయినా, దాని గట్టుమీద మనోహరంగా పచ్చిక పెంచబడివున్నది. చాలా చోట్ల బెంచీలు వెయ్యబడి వున్నాయి. చల్లని గాలి ఎంతో హాయిని కూరుస్తుంది. సముద్రతీరాన హాయిగా సుఖించే అవకాశం లేని కలకత్తా ప్రజలకు ఇదే పెద్ద విశ్రాంతిభూమి. కాని, యీ అవకాశాన్ని వినియోగించుకునేవారి సంఖ్యకూడా తక్కువగానే వుంటుంది.

అక్కడినుంచి మేము కాళికాదేవి గుడికి వెళ్ళాము. కాళికామూర్తి చాలా భయంకరంగా వుంటుందని సాధారణంగా జనులందరూ అనుకుంటారు. కాని, కలకత్తా కాళీమాత విగ్రహం అనుకున్నంత భయంకరంగా వుండదు. కాని, ఇప్పటికీ అక్కడ జంతుబలి నిరాటంకంగా జరుగుతూ వుండడం కొంత ఆశ్చర్యాన్ని కలిగించకపోదు.

తర్వాత మేము ముఖ్యమైన రోడ్లపైనుండి వెళ్లుతూ సీల్దా స్టేషను చూచాము. అది కలకత్తాలోని రెండవ పెద్ద

స్టేషను. తూర్పుభాగంలో వున్న రైలుశాఖలకు ఇది కేంద్రం. ఆసాము వెళ్లదలచినా, తూర్పుపాకిస్తానుకు వెళ్లదలచినా ఇక్కడినుంచే బయలుదేరి వెళ్లాలి. మేము ఆ మార్గంవెంట పోతూ, మరికొన్ని నిమిషాలకు మా ప్రధానగమ్యములైన జైన మందిరాలకు వెళ్ళాము.

కలకత్తాలోనే కాదు—భారతదేశంలోని అద్భుత దృశ్యాలలో ఈ జైనమందిర సంచయం ఒకటి. ఇవి ఒక పెద్ద ఆవరణలో నిర్మించబడి వున్నాయి. రంగురంగుల కాచ శకలాలు పొదగబడిన ఈ మందిరాలు రాత్రిసమయంలోనే ఎంతో ఆకర్షణీయంగా ఉంటాయి. గాజుముక్కలు పొదిగి అద్భుతమైన శిల్పాన్ని సృజించిన కళావేత్తలు ఎంత ధన్యులో! వారి కీర్తి ఆచంద్రతారార్కం! ఆ మందిరాలకున్న ప్రాముఖ్యం కళాసంపదనుబట్టి వచ్చిందేకాని, స్థల మాహా త్మ్యాన్నిబట్టి వచ్చింది కాదని తెలుసుకున్నాం. అక్కడ వున్నంతసేపూ ఏదో నూతన వాతావరణమే గోచరించినది. మేము అక్కడ ఒక గంటకుపైగా గడిపినాము. తర్వాత ఉదయంనుంచీ మా వెంటనున్న కలకత్తా మిత్రులు మా కోరికప్రకారం మమ్మల్ని న్యూమార్కెట్టు దగ్గర విడిచిపెట్టి వెళ్లిపోయారు.

మరునాడు మేము ఏడుగంటలకు బస్సులో కూర్చుని ట్రంకురోడ్డుమీదనుంచి దక్షిణంగా ప్రయాణంచేసి హౌరా పట్నం చూసుకుంటూ (హుగ్లీ నదికి పడమటి తీరంలోవున్న పట్నానికి హౌరా అని పేరు. దాన్నిబట్టే స్టేషనుకున్నూ ఆ పేరు వచ్చింది.) కొన్ని మైళ్లు ప్రయాణంచేసి షాలిమార్ వచ్చాం. ఇంజినీరింగు కాలేజీల ప్రక్కగా హుగ్లీనదిఒడ్డు

చేరుకున్నాం. అక్కడ నది తూర్పునుండి పడమరకు ప్రవహిస్తూ వున్నది. నదిలో కొన్ని స్టీమర్లు ప్రయాణంచేస్తూ వుండడం చూచాము. మేమక్కడ బస్సులు దిగాము. ఆ ప్రక్కనే బొటానికల్ గార్డెన్సు ఉన్నాయని మా మార్గదర్శకులు చెప్పారు. ఆ తోటలను చూడడానికి అర్థమం పూట అయినా పడుతుంది. పూర్తిగా చూడడానికి మాకు అవకాశం లేదు. ఏదో చూచామని అనిపించుకుందికి కొంత భాగం మాత్రం చూచాము. ముఖ్యంగా అక్కడున్న గొప్ప వటవృక్షాన్ని చూచాము. అది అడయారులోని మర్రిచెట్టు కంటే పెద్దది. ఇది మిక్కిలి ప్రాచీనమైనదే అని చెప్తారు. ఈ తోట ఆసియాలో ఉన్న గొప్ప తోటల్లో ఒకటిగా పరిగణింపబడుతున్నది.

తర్వాత శ్రీరామకృష్ణ పరమహంస మఠం ఉన్న బేలూరికి బయలుదేరాం. అంటే కలకత్తా దక్షిణపు చివర నుండి ఉత్తరపు చివరకు వెళ్లామన్నమాట! ఆ మఠం బేలూరు అనే చోటికి కొంచెం దూరంగా ప్రశాంతమైన స్థలంలో హుగ్లీ తీరంలో ఉన్నది. అక్కడివారు మితభాషులు. తక్కిన ప్రపంచంతో ఎక్కువ సంబంధం లేనట్లు—వారి వారి విహిత కృత్యాల్లోనే నిమగ్నులై ఉంటారు. శ్రీ పరమహంస యోగి జీవితాన్ని గడిపిన ఆ పవిత్రస్థలాన్ని దర్శించినతర్వాత మేము విల్లింగ్డను బ్రిడ్జిమీదుగా హుగ్లీనది దాటి దక్షిణేశ్వరానికి వచ్చాము. దక్షిణేశ్వరం శ్రీ రామకృష్ణ పరమహంస యోగ సాధనకూ, సిద్ధికీ నిలయమైనచోటు. రాణీ రాసమణీదేవి నిర్మించిన కాళీ దేవాలయమూ, ప్రతిష్ఠించిన శివలింగాలూ అక్కడఉన్నవి. శ్రీ పరమహంస దేవికి పూజాదులు చెయ్య

డానికి నియమించబడి, అక్కడే యోగాభ్యాసం చేశాడు. మేము ఆ ఆలయాలు చూసుకుని, కలకత్తాకు తిరిగి వచ్చాము.

మేము మూడు గంటలకు మ్యూజియం చేరుకున్నాము. భారత దేశంలో వున్న వస్తుప్రదర్శనశాల లన్నిట్లోకీ యిదే పెద్దది. మద్రాసులోని మ్యూజియం దీనికంటె ఎంతో చిన్నది. నా అనుభవాన్నిబట్టి మృగశాలంగానే యిదీ ఎక్కువ అభివృద్ధి పొందలేదనిమాత్రం తోచింది. కొన్ని భాగాలకు పోవడానికి వీలులేకుండా మార్గం అవరోధింపబడినది. ఆ భాగాలు మరమ్మత్తుకు లోనయినా ఉండాలి, లేదా—అందరూ చూడరాని అమూల్య వస్తువులైనా ఆ యా చోట్లలో వుండి వుండాలి.

అక్కడినుంచి బయలుదేరి మేము సెంట్ పాల్స్ చర్చికి వెళ్ళాము. అది ప్రాచీనమైనదిన్నీ, ప్రసిద్ధమైనదిన్నీ. మాలోని క్రైస్తవులు కొందరు అక్కడివారితో ప్రసంగించి, ఆ చర్చికి సంబంధించిన ఫోటోలు కనుక్కున్నారు. కొన్ని కరపత్రాలూ, గ్రంథాలూ సంపాదించారు. తర్వాత ముఖ్యమైన భవనాలు కొన్ని చూచుకుంటూ బజారుమార్గాన పోతూ ఇండియా కాఫీబోర్డువారి కాఫీ హోటలులో రుచికరమైన కాఫీ త్రాగి, బజారు వీథిలో ఒక ప్రక్కగా నియమిత స్థానంలో బస్సులు నిలిపినాము. అక్కడ గంటన్నర సేపు బస్సు లుంటాయనీ, ఎవరు కోరిన చోటికి వారు పోయి రావచ్చుననీ, కావలసినవి కొనుక్కోవచ్చుననీ మా లీడరు చెప్పాడు. అవి మా యాత్రలోని చివరి ఘట్టపురోజులు! వాళ్లు వాళ్లు అదనంగా తెచ్చుకున్న సొమ్ము చాలావరకు ఇదివరకే ఖర్చయిపోయింది. అందువల్ల వస్తువులు కొనవలె

నసే ఉబలాటం అందరకూ లేదు. అయినా, తోటివారు కొంటూవున్నప్పుడు—కొనాలనే కోరిక వుండడం సహజం! అందుచేత, అందరూ కొద్దిగానో గొప్పగానో కొన్నివస్తువులు కొన్నారు. మేము ఎనిమిదికి స్టేషను చేరుకున్నాం. రావలసిన వాళ్ళందరూ తొమ్మిదింటికి లోగానే వచ్చారు.

*  *  *

తర్వాతి మా మజిలీ టాటానగరు. అది ప్రసిద్ధమైన ఉక్కు, ఇనుము కర్మాగారాల కేంద్రం. ఇది కలకత్తాకు 156 మైళ్ళు. కలకత్తానుంచి నాగపూరు వెళ్లే లైనుమీద వున్నది. హౌరానుంచి నాగపూరు వరకూ, దక్షిణంలో వాల్తేరు వరకూ ఆగ్నేయ రైల్వే. మేము తొమ్మిది ముప్పావుకు బయలుదేరే నాగపూరు ప్యాసెంజరులో ప్రయాణంచేసి, తెల్లవారుజామునకు టాటానగరు వెళ్లవలసి వున్నది. కాని, బండీ గంట లేటుగా బయలుదేరినది.

రాత్రి రెండున్నరకు ఖరగ్పూరు జంక్షను వచ్చినది. ఇంతవరకూ జంట మార్గాలు ఉన్నవి. ఇది చాలా పెద్ద స్టేషను. మద్రాసు మెయిలూ, బొంబాయిమెయిలూకూడా ఇక్కడిదాకా కలిసే వస్తాయి. తర్వాత మద్రాసు వెళ్లే బండ్లు ఇక్కడినుంచి చీలిపోయి దక్షిణంగా వాల్తేరుమీదుగా వెళ్తాయి. ఖరగ్పూరునుంచి మరొక లైను ఉత్తరంగా పోయి, గోమో, అసన్సోలులకు వెళుతుంది. ఖరగ్పూరులో ఈశాన్య రైల్వేవారి పెద్ద వర్కుషాపు ఉన్నది. దీని తర్వాతి పెద్ద స్టేషనే **టాటానగరు.** మేము అక్కడికి ఉదయమయ్యేసరికి వెళ్ళగలిగాము.

మా రాకను ముందుగానే ఎరిగిన శ్రీ సుబ్రహ్మణ్యాం

గారు ఒక పెద్ద బస్సుతోకూడా వచ్చి, మాకు స్వాగతం ఇచ్చారు. మేము వెంటనే గోల్మోరి అనేచోట ఉన్న దక్షిణ ఇండియా సంఘంవారి రీడింగురూముకు వెళ్ళాము. ఆ సంఘ కార్యకర్తలలో శ్రీ సుబ్రహ్మణ్యంగారు ముఖ్యులు. మాకు కాఫీ, ఫలాహారాలనూ, భోజనాన్నీ ఆయన అక్కడే ఏర్పాటు చేశారు.

ఫలాహారాలయాక మేము టిన్ రేకులు తయారుచేసే టిన్ ప్లేటు కంపెనీ వర్కుషాపు చూచి, భోజనానంతరం టాటా కంపెనీ వర్కుషాపునూ, ఇండియన్ స్టీల్ కంపెనీ వర్కుషాపునూ చూచాము. అక్కడివారు గనిలోనుంచి వచ్చిన ముడి ఇనుమును శుద్ధిచేయడం దగ్గరనుంచీ, వివిధ వస్తువులు ఉత్పత్తి అయేదాకా జరిగే కార్యక్రమాలను వివరించి చెప్పారు. అన్నీ చూసుకుని నాలుగున్నరకు మేము స్టేషనుకు వచ్చాము. ఐదుంపావుకు బయలుదేరే పాట్నా ప్యాసెంజరులో పదిన్నరకు ఖరగ్పూరుకు వచ్చాము. తర్వాత, మా కారును విడదీసి, కలకత్తానుంచి వచ్చే పూరీ ఎక్స్‌ప్రెస్‌కు కట్టారు. ఆ బండీలో మేము శ్రీ జగన్నాథం వెళ్లి దేవదర్శనం చేసుకుని, మా ఉత్తరదేశయాత్రను పూర్తి చెయ్యదలచాము.

*           *           *

మర్నాడు ఉదయం తొమ్మిది గంటలకు పూరీ చేరుకున్నాం. దారిలోని పెద్ద స్టేషనులు కటకమూ, ఖురదా రోడ్డునూ. ఇవి మద్రాసువచ్చే మార్గంలోనివే! వీటి నడుమ భువనేశ్వరం అనే పెద్ద క్షేత్రం ఉన్నది. అది గొప్ప శైవ స్థలం! కాని, మేమక్కడ దిగలేదు. ఖురదా

నుంచి సముద్రతీరానికి గల బ్రాంచిలైను చివరనే పూరీ వున్నది. అక్కడ మేము సముద్రస్నానమూ, శ్రీ జగన్నాథ స్వామియొక్క, సుభద్రా దేవియొక్క బలభద్రస్వామియొక్క దర్శనమూ చేసుకుని, తిరిగి ఖురదావచ్చి జనతా ఎక్స్‌ప్రెస్‌లో మర్నాడు రాత్రికి వాల్తేరు వచ్చాం. దారిలో ఇచ్ఛాపురం స్టేషనులో మిత్రులు శ్రీ కర్రి-వెంకట సుబ్బారావుగారూ, శ్రీ కృష్ణమాచార్యులుగారూ, మిగిలిన హైస్కూలు ఉపాధ్యాయులూ, ప్రధానోపాధ్యాయులూ కలుసుకుని, మేము ఇన్నిచోట్లు చూచి వస్తున్నందుకు అభినందించారు.

పిదప విశాఖపట్నంలో హార్బరూ, షిప్ బిల్డింగు యార్డూ, సుందరదృశ్యాలూ చూచి, జనతా ఎక్స్‌ప్రెస్‌లో బయలుదేరి బెజవాడలో కృష్ణాస్నానంచేసుకుని 1956 అక్టోబరు 9-వ తేదీ ఉదయానికి మద్రాసుకు వచ్చాం.

శ్రమలేకుండా ఇలా యాత్ర ముగించుకు రావడానికి మనిషికి రూ. 150 ఖర్చయినది. భారతదేశంలోని రైల్వేలలో ఒక్క పడమటి రైల్వేలో తప్ప మిగిలిన రైల్వేలు అన్నింటిలోనూ రమారమీ నాల్గువేల మైళ్లు ప్రయాణం చేశాము. రాష్ట్రాలలో మద్రాసు, ఆంధ్రప్రదేశ్, బొంబాయి, మధ్యప్రదేశ్, ఉత్తరప్రదేశ్, బీహార్, పడమటి బెంగాల్, ఒరిస్సాలు చూచాము. మా యాత్ర సంతృప్తికరంగా జరగడానికి ముఖ్యకారకులైన శ్రీ జె. డి. ముత్తయ్యగారిని ఎప్పుడూ మరిచిపోలేము.

